"ఆంధ్రరత్న"

# ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సుటాక్సు ఆక్టు

## VI OF 1957

[ మరియు రూల్సు, ఫారములు ]

అనువాదకులు :

కె. ప్రసాదరావు, B. A.,

ఇన్‌కంటాక్సు ప్రాక్టీషనర్, సేల్సుటాక్సు ప్రాక్టీషనర్;

మారీసుపేట, (P. O.) తెనాలి - 2



పబ్లిషర్సు

ఆంధ్రరత్న బుక్‌డిపో తెనాలి

ఫోన్ నెం. 64

వెల 2-0-0

# ప్ర స్తా వ న

ప్రజాపరిపాలన విధుల, నిర్వహణమునకు మూలాధారమైనవి పన్నులు. ధృవమండల పర్యంతము కీకారణ్యములలో సైతము నివసించు ప్రతి మానవుడు యేదో ఒక రూపేణా పన్నులు చెల్లించి రాజ్యపాలనకు తోడ్పడవలసినదే. ములు, గవ్వలు, జంతువుల రూపంలో జరిగిన పన్ను చెల్లింపులు, నాణెములు వెలసిన తరువాత రొఖ్ఖ రూపేణా నిర్ణయింప బడినవి. చెల్లించు వానికి బాధలేని విధమునను, వసూలుపరచు పాలకులకు వ్యయము లేకుండునది, ఉత్తమమైన పన్నుగా Adam Smith నిర్ణయించెను.

స్వతంత్రము పొందిన భారతదేశములో అమ్మకము పన్ను అట్టి మొదటితరగతి పన్నులలో ఒకటి. రు 100/- పన్ను వసూలుపరచుటకు 0-4-0 మాత్రమే ఖర్చు అగునని అంచనావేయబడినది.

బాధ్యతగల ప్రతి పౌరుడు, సంక్షేమరాజ్యస్థాపనకు మూలమైన ఆర్థికావసరము తొలగించుటకు రూపొందిన ఈ అమ్మకము పన్నును కొంతవరకైన చెల్లించక వీలులేదు.

అందుకు పాలకులు వ్యాపారస్థులందరిని సహాయకారులుగా నిర్ణయించి, దారితొలగి చనువారిని మాత్రము శిక్షించదలచినట్లు ఈ చట్టమువలన తోచుచున్నది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ఏర్పడిన చట్టముకన్న, ఈ చట్టము

వందు అన్నిలోపములు సవరింపబడి విస్తృతము చేయబడినది. ఈ చట్టము ననుసరింపవలసిన ప్రతి పౌరుడు, వివరములు తెలుసుకోవలసిన బాధ్యత కలదుగాన, దీనిని మూలమైన ఆంగ్లమునుండి తెలుగులోనికి వ్రాయవలసి వచ్చినది.

భాషాలోపముచేగాని, మాటలకూడికచేగాని ఏవైనా సందేహాము లున్నయెడల ఆంగ్లమూలము ననుసరించి కార్యము నడుపు కొనవలయును.

ఏ చట్టమైనా తెలుగులోనికి మార్చుట అవుసరం లేదని చాలమంది అభిప్రాయము. కాని ప్రాంతీయ భాష లోనే ప్రభుత్వ కార్యక్రమాలు జరుపవలయు ననెడి నేటి యీ రోజులలో, యిటువంటి పుస్తకములు ఎంతో అవసరమని మాయూహ. ప్రమాదదోషముచే ఏర్పడిన లోపములు పాఠకులు మన్నింతురుగాక.

"ఆంధ్రరత్న" వారు ప్రజలకు అవసరమైన యితర చట్టములుగూడ తెలుగులోనికి తేవలయునని తలంచి యున్నందున, ఆ ప్రయత్నములలో ఇది మొదటిదిగా వెలువడుచున్నది. పాఠకులు ఉదారతతోపంపు సూచనలు రాబోవు ప్రచురణలలో అమలునందుంచుటకు సంకల్పించితిమి.

శ్రేయుడు

తెనాలి
24–10–57

కె. ప్రసాద్ రావు B. A.
ఇన్‌కంటాక్సు ప్రాక్టీషనరు, సేల్సుటాక్సు ప్రాక్టీషనరు

# విషయ సూచిక

A మూలము

1. రేట్లు

2. మినహాయింపులు

3. లైసెన్సులు, రిజిస్ట్రేషను, చెల్లించవలసిన రుసుములు

4. టర్నోవరుమీద ఎవరు పన్ను వేయునది.

5. అప్పీళ్లు, రివిజనులు, వగైరా

6. నేరములు, శిక్షలు,

7. ఎప్పుడు, ఎవరు, ఏమిచేయవలసినది

---

# సవరణ

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 97, | 6, | తనిఖీసందరములో | తనిఖీసందర్భములో |
| 97, | 28, | 1899 | 1898 |
| 104, | 4, | రు 25,000 లోపలి | రు 25,000 లోపలికాని |

104, 6, 7, మధ్య ఈ లైను చదువుకోవలెను:- లేక రు 1కి 2+5 న. పై.

# ఆంధ్రప్రదేశ్

# జనరల్ సేల్స్ టాక్సు యాక్టు VI of 1957

ఆంధ్రప్రదేశ్ శాసనసభవారిచే ఆమోదింపబడిన ఈ *చట్టాన్ని 1957 సం॥ మే 22 వ తేదీని రాష్ట్రగవర్నరుచే భారతదేశాధ్యక్షుల అంగీకారముకొరకు ప్రత్యేకింపబడింది. భారతదేశాధ్యక్షులు మే 31 వ తేదీని యీ చట్టాన్ని అంగీకరించారు. ఈ చట్టము జూన్ 15 వ తేదీనుంచి అమలులోనికి వచ్చినట్లు రాష్ట్రప్రభుత్వమువారిచే ప్రకటింపబడింది.

ఇది ఆంధ్రప్రదేశ్ లో సరుకులు అమ్మకం లేక కొనుగోలు పన్ను విధించటానికి తగు నిబంధనలతో రచింపబడింది. ఇది భారతదేశ అష్టమ రిపబ్లిక్ సంవత్సరములో, 1957 సంవత్సరపు రాష్ట్రప్రభుత్వమువారి 6 నెంబరు చట్టముగా చట్టరూపం దాల్చింది.

---

* ఇంగ్లీషులో వెలువడిన చట్టాన్ని ఆధారముచేసి కొని, ప్రతి శెక్షను, సబ్ శెక్షను, క్లాజులలోని భావముగాని, అర్థముగాని, చెడకుండా ప్రతివ్యక్తికి బహు తేలికగా అర్థమగునట్లు తెలుగులో వ్రాయబడింది.

కనుక, యింగ్లీషు చట్టములోని మాటకు మాటగా, వాక్యమునకు వాక్యముగా వ్రాసిన తెలుగుతర్జుమా కాదని గ్రహింప గోరుచున్నాము. ఇంగ్లీషు వాక్యమునకు, తెలుగు తర్జుమాలో వాక్యభేదమువుంటుంది గాని అర్థమువొక్కటే.

## శెక్షను 1.

1. ఈ చట్టాన్ని ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సు టాక్సు యాక్టు 1957 అని పిలువబడుతుంది.

2. ఈ చట్టము ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికంతకూ వర్తిస్తుంది.

3. ఈ శెక్షను వెంటనే అమలులోనికి వస్తుంది. మిగిలిన శెక్షన్లు ఆంధ్రప్రదేశ్ గెజెట్టులో ప్రకటింపబడిన తేదీ నుంచి అమలులోనికి వస్తాయి.

## శెక్షను 2.

నిర్వచనాలు (డెఫినిషన్సు) (1) యీ చట్టంలో సందర్భానుసారం మరో అర్థం రానప్పుడు,

(ఎ) "అప్పిలెట్ ట్రిబ్యూనల్" అనగా 3 వ శెక్షను ప్రకారం, రాష్ట్రప్రభుత్వమువారిచే నియమింపబడిన ట్రిబ్యూనల్ అని అర్థం.

(బి) "పన్ను విధించే అధికారి" అంటే యీ చట్ట ప్రకారం "రాష్ట్రప్రభుత్వము" లేదా ఇతర నియమింపబడిన అధికారులచే ఈ పనికొరకు నియమింపబడిన వ్యక్తి అని అర్థం.

(సి) "తాత్కాలికవ్యాపారి" (క్యాజుయల్ డీలరు) అంటే నగదుకు లేక కొంతకాలం తరువాత నగదు చెల్లించేపద్ధతిలో లేక కమీషను లేక వేతనం లేక యితరలాభం పొందడానికి యజమానిగాగాని, ఏజంటుగాగాని లేక యితరవిధంగాగాని సరుకులు కొనటం, అమ్మటం, పంచటం వ్యవహారంతో కూడిన వ్యాపారాన్ని (తాత్కాలికంగా అప్పుడప్పుడు చేసేవాడు) జరిపేవ్యక్తి అని అర్థం.

(డి) "కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు" అంటే 4 సెక్షను ప్రకారము నియమింపబడిన వ్యక్తి అని అర్థం.

(యి) "వ్యాపారి" అంటే నగదుకు లేక కొంతకాలం తరువాత చెల్లించే పద్ధతిలో లేక కమీషను లేక వేతనము లేక యితరలాభం పొందటానికి ప్రత్యక్షంగాగాని, యితర విధంగా గాని, సరుకులు కొనటం, అమ్మటం, లేక పంచటం లేక సరఫరా చేయటం, వ్యవహారంతో కూడిన వ్యాపారం సాగించే వ్యక్తి అని అర్థం.

యి. (1) రాష్ట్రప్రభుత్వం, స్థానికప్రభుత్వం, కంపెనీ, హిందూ సమిష్టికుటుంబము, సంఘం (సహకారసంఘంకూడా) క్లబ్: అసోసియేషను, ఫరమ్ మొదలయినవి వ్యాపారం సాగిస్తే,

యి. (2) సహకారసంఘం, క్లబ్, ఫరమ్, అసోసియేషను వాటి సభ్యులనుంచి సరుకులు కొన్నా, అమ్మినా లేక సరఫరా చేసినా, పంచినా,

యి (3) ఒక తాత్కాలిక వ్యాపారి (రూ. 14. ఫా. A-3)

యి. (4) కమీషను ఏజంటు, బ్రోకరు, "డెల్ క్రీడర్ ఏజంటు", వేలంపాటలు పాడేవాడు, ఏవిధంగానైనా వ్యాపారలావాదేవీలు జరిపేవాడు, వారిని ఏ పేరు పెట్టి పిలిచినా, సరుకులుకొనుట, అమ్ముట, పంచుట, సరఫరాచేయుట, స్వయంగాగాని, యితరుల తరఫునగాని వ్యాపారంచేసేవ్యక్తిని "వ్యాపారి" అని అర్థం తీయాలి.

వివరణ : యీ రాష్ట్రంలో నివసించని ఒక వ్యాపారి తరఫున, ఏజంటుగా పనిచేస్తున్న వ్యక్తిఅంటే ఇతరరాష్ట్రంలో నివసిస్తున్న ఒక వ్యాపారితరఫున ఏజంటుగా యీ రాష్ట్రంలో

సరుకులుకొన్నా, అమ్మినా, పంచినా, సరఫరాచేసినా అటువంటి వ్యాపారి తరఫున వ్యవహరించినా,

1. 1930 యిండియన్ సేల్ ఆఫ్ గుడ్సు యాక్టులో చెప్పినట్లు ఒక వ్యాపారికి ఏజంటుగా లేక—

2. సరుకులకు సంబంధించిన పత్రాల వ్యవహారము జరుపటానికి ఏజంటు, లేక—

3. వస్తువుల అమ్మకపుధరను వసూలుచేయటానికి, లేక చెల్లించటానికివున్న ఏజంటు లేక అటువంటి వసూళ్ళకు చెల్లింపులకు హామీపడేవ్యక్తి మరిన్ని రాష్ట్రం వెలుపలనున్న ఒక కంపెనీకి లేక ఫరంకు "బ్రాంచి" గా స్థానికంగావున్న ఒక ఫరం, లేక కంపెనీ, యీ చట్టప్రకారం "వ్యాపారి" అని పిలువబడుతారు.

(ఎఫ్) "ప్రకటించబడిన సరుకులు" (డిక్లేర్డ్ గుడ్సు) అంటే కేంద్రప్రభుత్వపు 1956 సెంట్రలుసేల్సుటాక్సు యాక్టు 14 సెక్షను ప్రకారం, అంతర్రాష్ట్ర వ్యాపారంలో ప్రత్యేక ప్రాముఖ్యంయిచ్చి ప్రకటింపబడిన సరుకులు అని అర్థం.

(జి) డిప్యూటీ కమీషనరుఅంటే 4 శెక్షను ప్రకారము నియమింపబడివ్యక్తి అని అర్థం.

(హెచ్) "సరుకులు" అంటే అన్నిరకాల చరాస్తి, అని అర్థం. చర్యతీసికొనతగు క్లెయిములు, నిలవలు, వాటాలు, సెక్యూరిటీలు, చరాస్తిగా పరిగణింపబడవు. కాని అన్నిరకాల వస్తువులు, పదార్థాలు, ద్రవ్యాలు, సరుకులక్రిందవస్తాయి. స్థిర, లేక చరాస్తిని, బాగుచేయటానికి, అభివృద్ధిపరచటానికి, నిర్మాణం చేయటానికి, లేక సరిగా వుంచటానికి, వాటినిమిత్తమై ఉపయోగపడే అన్నివస్తువులు సరుకులుగా ఎంచబడతాయి.

పెరుగుతూవున్న పైర్లు, గడ్డి, భూమిలో భాగంగాగాని, భూమికి అంటుకొనియుండేవి గాని అవికూడా సరుకులుగా ఎంచబడతాయి. (వీటిని అమ్మకానికి పూర్వం, లేదా అమ్మకం షరతుల ప్రకారం విడిపరచుటకు వీలువుంటుంది.)

(ఐ) లైసెన్సుఅంటే యీ చట్టంప్రకారం "లైసెన్సు" యివ్వటం, లేదా యిచ్చిన లైసెన్సును పొడిగించటం అనిఅర్థం.

[రూ. 30 (1) ఫా D. 3]

(జె) "ప్రకటన" అంటే ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటింపబడినదని అర్థం.

(కె) "వ్యాపారస్థలం" అంటే ఒక వ్యాపారి ఏ సరుకులనైనా కొన్నా, అమ్మినా లేక సరుకులను నిలవవుంచినా, లేక కొనుగోలు, అమ్మకం సంబంధించిన లెక్కలపుస్తకాలు వుంచిన స్థలం. లేక యీ పైపనులు చేసిన ప్రదేశం చేయబడిన

(ఎల్) "నిర్దేశింపబడ్డ" అంటే యీ చట్టంప్రకారము నిబంధనల ననుసరించి నిర్దేశింపబడినవి అని అర్థం.

(ఎమ్) "రిజిష్టర్డు డీలరు" అంటే ఒక వ్యాపారి, యీ చట్టంప్రకారము రిజిష్టరు గాబడినవాడు.

(ఎన్) "అమ్మకం" అంటే యీ పదాన్ని వ్యాకరణ రీత్యా వాడే అన్ని రూపాలు అని అర్థం. నగదుగాగాని, కొంతకాలం పిమ్మట నగదు చెల్లించే పద్ధతిలోగాని లేక యితర లాభానికిగాని, ఒకవ్యక్తికి, మరోవ్యక్తి సరుకులను బదలాయించటం, వ్యాపార లావాదేవీలు జరపటం (అమ్మకం) అని అర్థం. పనుల కాంట్రాక్టుకు కావలసినవస్తువులు, లేక సంఘం, క్లబ్, ఫరమ్ అసోసియేషన్ వీటి సభ్యులకు కావలసిన సరుకులు సరఫరా లేక పంపకం చేయటంలో జరిగే ప్రతి ఆస్తిబద

లాయింపు అమ్మకంక్రింద ఎంచబడుతుంది. కాని సరుకు తనభా వుంచినప్పుడు అమ్మకంక్రిందకురాదు.

వివరణ : (1) సరుకులను అద్దెఅమ్మకం జరిగినా, దఫాల వారీగా ధరచెల్లించే పద్ధతితో యిచ్చినా అది అమ్మకంక్రిందకు వస్తుంది. ఈ పద్ధతిలో సరుకుమీాద హక్కు అమ్మకందారుకు వున్నా, సరుకు మార్పుబడుటవల్ల అమ్మకం అయినట్లు ఎంచుకోవాలి.

వివరణ : (2) (ఎ) 1930 యిండియన్ సేలు ఆఫ్ గుడ్సు యాక్టులో నిబంధనలు ఎల్లావున్నా, అమ్మకం కొనుగోలు, కంట్రాక్టు ఎక్కడ వ్రాయబడినప్పటికి, కొనుగోలు ఎక్కడ జరిగినప్పటికి యీ రాష్ట్రింలోవుంటే యీ చట్టంప్రకారం సరుకుల అమ్మకం, యీ రాష్ట్రింలో జరిగినట్లు ఎంచుకోవాలి.

1. ఎ. ప్రత్యేకమైన, లేక నిశ్చయమైన సరుకుల విషయంలో కొనుగోలు, లేక అమ్మకం కంట్రాక్టు జరిగినప్పుడు.

(2) ఎ. అనిశ్చయమైన లేక ముందుతయారయి వచ్చే సరుకుల విషయంలో కొనుగోలుదారు లేక అమ్మకందారు, అమ్మకం కంట్రాక్టుననుసరించి సరుకు కేటాయించినప్పుడు, యీ కేటాయించుట రెండోపక్షం అనుమతియిచ్చినా, యివ్వక ముందు జరిగినా—

వివరణ : (2) (బి) అమ్మకం లేక కొనుగోలుకు సంబంధించిన సరుకులు అనేకప్రదేశాలలోవుండి వాటిఅమ్మకం లేక కొనుగోలుకు ఒకే ఒక కంట్రాక్టుఉన్నట్లయితే, యీ చట్టము లోని "ఎ" క్లాజుననుసరించి, ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క విడికాంట్రాక్టు వున్నట్లుగా ఎంచబడుతుంది.

వివరణ : 3 యీచట్టంలోగాని, లేక 1930 యిండి యన్ సేలు ఆఫ్ గుడ్సు యాక్టులోగాని ఏ నిబంధనలు వున్న ప్పటికి రెండు ప్రత్యేక అమ్మకాలు జరిగినట్లు ఎంచబడుతుంది

1. ఒక సరుకు ఉత్పత్తిదారునుంచి, అతని అమ్మకపు ఏజంటుకు, అమ్మకపు ఏజంటునుంచి కొనుగోలుదారుకు, సరుకులు బదలాయింపబడినట్లయినా, లేక-

(2) అమ్మకపుదారునుంచి ఒక కొనుగోలుదారు ఏంజటుకు, ఏజంటువద్దనుంచి అతని ఉత్పత్తిదారుకు సరుకులు బదలాయింపబడినా,

పై నుదహరించిన సందర్భాలలో ఏజంటు.

వి. 2 (1) ఒకధరకు సరుకులు అమ్మి మరో ధరకు ఉత్పత్తిదారుకు అమ్మకపు మొత్తం పంపినా లేక

వి. 2 (2) ఒకధరకు సరుకులుకొని, మరోధరకు ఉత్పత్తి దారుకు పంపినా లేక

వి. 2 (3) అమ్మకాలు లేక కొనుగోళ్ళ సందర్భంలో వసూలుచేన మొత్తాలు లేదా తగ్గించిన మొత్తాలయొక్క లెఖ్కలు ఉత్పత్తిదారుకు చూపకపోయినా (చూపేబాధ్యత అతనికి లేకపోయినా)

వి 2 (4) ఒకరికి ఏజంటునని చెప్పుకుని, ఏ ఉత్పత్తిదారుకు అతను ఏజంటో చెప్పకపోయినా లేక దొంగపేరు చెప్పినా,

(రెండుప్రత్యేక అమ్మకాలుజరిగినట్లుగా ఎంచబడుతుంది)

(ఓ) "షెడ్యూలు" అంటే యీ చట్టముయొక్క చివర చూపబడిన షెడ్యూలు అనిఅర్థం.

(పి) "స్టేటు" అంటే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అనిఅర్థం.

(క్యూ) "టాక్సు" అంటే యీ చట్టంప్రకారం విధింపబడిన పన్ను.

(ఆర్) "టోటలు–టర్నోవరు" అంటే రాష్ట్రంలో ఒక వ్యాపారి, అన్నిచోట్ల చేసిన మొత్తపు వ్యాపారము అని అర్థం. ఈ జరిగిన మొత్తపు వ్యాపారానికి, అంతకుగాని కొంత మొత్తానికిగాని పన్నుపడినా, పడకపోయినా.

(ఎస్) "టర్నోవరు" అంటే జరిగిన వ్యాపారం. అమ్మకపుబిల్లులలో ఉదహరించిన మొత్తము అని అర్థం. అమ్మకపుబిల్లులు లేకపోతే వసూలుచేసిన అమ్మకపు మొత్తం అనిఅర్థం. వస్తువుల కొనుగోలు లేక అమ్మకం సందర్భాలలో రొఖ్ఖంగా లేక తరువాత చెల్లించే పద్ధతిలో లేక తదితరలాభాలకొరకు, ఒకవ్యాపారి సరుకులను అమ్మేటప్పుడు లేదా కొనుగోలుదార్లకు స్వాధీనపరిచేటప్పుడు అది ఏపేరుతో పిలువబడ్డా అది అమ్మకపు వ్యాపారం అవుతుంది.

పొలములలో లేదా తోటలలోపండేపంటను, భూమి ఆసామి లేదా కవులుకు తీసుకున్న వ్యక్తిలేదా పంటను అనుభవించేవ్యక్తి, మొదలయినవారు అమ్మినఅమ్మకము వ్యాపార మొత్తము క్రిందకురాదు. అయితే యీపంటలను పండినట్లుగానే అమ్మాలి. తినటానికి వీలుగా వుండేటట్లు ఎట్టి భౌతిక, రసాయనిక లేదా యితరవిధంగా మార్పులను చేయరాదు. (అంటే వ్యవసాయదారుడు తన లాభంకోసం, పంటను యంత్రాలద్వారాగాని, యితరవిధాలుగాగాని, పంటయొక్క సహజరూపాన్ని మార్పుచేసి అమ్మితే అది వ్యాపారం అవుతుంది) అయితే పంటను బాగుచేసి, తరగతివారిగా విభజించి అమ్ముకుంటే అది వ్యాపారంగాదు.

వివరణ:- ఈ సందర్భంలో నిర్ణయింపబడిన షరతులు-నిబంధనలు ఏమైనావుంటే వాటికి లోబడి.

వివరణ (1) :-కాంట్రాక్టుగా ఒప్పుకుని చేసిన పనులలో వాడే వస్తువులయొక్క ధరలను, దామాషాగా నిర్ణయింప బడే కాంట్రాక్టునకి అయ్యేఖర్చులు (అంటే లేబరుఖర్చులు) పోను మిగిలిన మొత్తమంతా వ్యాపార మొత్తంలోకే వస్తుంది.

వివరణ (2) అమ్మకం ధరలో నగదు లేక తదితర మిన హాయింపులు, వస్తువులు వాపసు చేసినప్పుడు, చెల్లించే మొత్తాలు వ్యాపార మొత్తంలో చేరవు.

వివరణ (3) ఒక వ్యాపారి తన ఖాతాదారుకు కావలసిన సరుకులు, మరొక వ్యాపారివద్దనుంచి తెప్పించి, ఆసరుకు వెంటనే అమ్మి వేసినప్పుడు ఆ మొత్తం, మరో వ్యాపారి జరిపినవ్యాపార మొత్తంలోకే వస్తుంది.

(టి) "పనుల కంట్రాక్టు" అంటే నగదుకు లేదా తరువాత నగదు చెల్లించే పద్ధతిలో లేక తదితరలాభానికి ఒకదానిని "నిర్మించటం" దానికి కావలసిన సామానులు సిద్ధం చేయటం, భవనాలు, రోడ్లు, బ్రిడ్జిలు యితర స్థిరాస్తులు మొదలయినవి వృద్ధిచేయుటం లేదా నిర్మించటం అని అర్థం

(యు)"సంవత్సరమంటే" మార్చి 31 వ తేదీతో అంత మయ్యే 12 నెలలు అనిఅర్థం. లేదా పన్ను చెల్లించేవ్యక్తి మరో తేదీనుంచి లెఖ్ఖలు ప్రారంభిస్తే ఆ తేదీతో అంతమయ్యే 12 నెలలు అనిఅర్థం. అయితే పన్ను చెల్లించే వ్యక్తిపైనపేర్కొన్న అవకాశాన్ని ఒకేసారి ఉపయోగించుకోవాలి. ఈ సంవత్సర అర్థాన్ని తిరిగి మార్చకూడదు. ఈ విషయంలో ఆ ప్రాంత

ముపై అధికారము కలిగిన కమర్షియల్ టాక్సు ఆఫీసరు అనుమతిని ముందుగా పొంది మార్చుకోవాలి.

వివరణ:- (1) ఈ చట్టము అమలులోనికి రాకపూర్వము, ఈ అవకాశాన్ని నిబంధనల ననుసరించి ఉపయోగించుకుంటున్న వ్యక్తి, యీచట్టప్రకారము ఉపయోగించు కుంటున్నట్లు అర్థంవస్తుంది.

వివరణ:- మద్రాసు జనరల్ క్లాజులు 1891 చట్టం ప్రకారము అందులోని నిబంధనల ననుసరించి ఈ చట్టానికి కూడ అర్థాలు చెప్పుకోవలెను.

## శెక్షను 3.

"అప్పిలేట్ ట్రిబ్యూనలు" (1) రాష్ట్రప్రభుత్వమువారు అప్పిలేట్ ట్రిబ్యూనలు అను ఒక సంఘాన్ని నియమిస్తుంది. ఈ సంఘంలో ఒక అధ్యక్షుడు యిరువురు సభ్యులు వుంటారు. ఈ చట్టప్రకారము, యీ సంఘము నిర్వహించవలసిన విధులను నిర్వర్తిస్తూవుంటుంది. జిల్లాజడ్జి హోదాకు తగ్గని ఒక న్యాయాధికారి, యీ ట్రిబ్యూనలుకు అధ్యక్షులుగా వుంటారు. మిగతా యిద్దరు సభ్యులు నియమింపబడిన అర్హతలు కలిగియుందురు.

(2) అప్పిలేట్ ట్రిబ్యూనలులో సభ్యత్వాలు ఖాళీ అయితే రాష్ట్రప్రభుత్వము ఆయాఖాళీలను పూర్తిచేస్తుంది.

3. (ఎ) అప్పిలేట్ ట్రిబ్యూనలు తన విధులను ఈ క్రిందివిధంగా నిర్వహిస్తుంది.

(1) సభ్యులందరితోకూడిన అప్పిలేట్ ట్రిబ్యూనలు బెంచి, లేక

(2) అధ్యక్షునిచే నియమింపబడిన యిరువురి సభ్యులతో కూడిన బెంచి, లేక

(3) అధ్యక్షుడు, అధ్యక్షునిచే నియమింపబడ్డ మరో సభ్యుడు గల బెంచి, లేక

(4) 20,000 రూపాయిలకు మించని వ్యాపారానికి సంబంధించిన కేసులు విచారించటానికి, ట్రిబ్యూనలులోని ఏ ఒక సభ్యుని అయినా అధ్యక్షులు నియమించవచ్చును.

వివరణ:- పైన (4) లో తెలిపిన ఏకసభ్యత్వం విషయంలో అధ్యక్షులుగాని, లేక తరితర సభ్యుడుగాని అనవచ్చును.

3 (బి) ఒక అప్పీలు లేక దరఖాస్తు విషయంలో అప్పిలేట్ ట్రిబ్యూనలు సభ్యులు ముగ్గురు విచారించి, ఒక అంశంలో గాని, కొన్ని అంశాలలోగాని, భేదాభిప్రాయం వచ్చినప్పుడు అధిక సభ్యుల అభిప్రాయాన్నిబట్టి యిచ్చిన తీర్పు ఖాయమవుతుంది.

3 (సి) ఒక అప్పీలు లేక దరఖాస్తు యిరువురి సభ్యులతో కూడిన బెంచీ విచారించేటప్పుడు యిరువురిలో ఒకరు అధ్యక్షులు అయినా కాకపోయినా 'తీర్పు'లో భేదాభిప్రాయాలు వస్తే, ముగ్గురు సభ్యులుగల బెంచీ, విచారించి తీర్పునిస్తుంది.

3 (డి) ఒక కేసు, ఒక సభ్యుడు విచారించేటప్పుడు (ఆ సభ్యుడు అధ్యక్షులు కాకపోయినా) యిరువురు సభ్యులు విచారించేటప్పుడు ఇరువురిలో అధ్యక్షులు లేకపోయినా ఆ కేసులో న్యాయశాస్త్ర సంబంధమయిన అంశాన్ని నిర్ణయించవలసివచ్చినప్పుడు అధ్యక్షునితో కూడిన బెంచీ విచారించాలని నిర్ణయించడమైనది.

**4.** ముందుగా రాష్ట్రప్రభుత్వమువారి అంగీకారాన్ని పొంది, అప్పిలేట్ ట్రిబ్యూనలు తన విధులను నిర్వహించుకొను

టకు ఈ చట్టానికి అనుగుణ్యంగావుండే నిబంధనలను ఏర్పాటు చేసికొంటుంది.

5. సబ్ శెక్షను 4 ననుసరించి ఏర్పడే నిబంధనలు ఆంధ్ర ప్రదేశ్ గెజెట్టులో ప్రకటింపబడును.

## శెక్షను 4

4. కమర్షియల్ టాక్సుల డిప్యూటీకమీషనర్లు, కమర్షియల్ టాక్సు ఆఫీసర్ల నియామకము:- ఈ చట్టప్రకారము విధులను నిర్వహించటానికి కావలసిన డిప్యూటీకమీషనర్లను, కమర్షియల్ టాక్సు ఆఫీసర్లను రాష్ట్రప్రభుత్వము నియమిస్తుంది. ఆయాప్రాంతాలలో రాష్ట్రప్రభుత్వముగాని, రాష్ట్రప్రభుత్వ అధికారవర్గంగాని సూచించిన విధులను, పై అధికారులు ఆయాప్రాంతాలలో తమతమ విధులు నిర్వహిస్తూ వుంటారు.

## శెక్షను 5

5. (1) సరుకులు అమ్మకంలేదా కొనుగోళ్ళమీద పన్ను విధించటంకొరకు ప్రతివ్యాపారి (తాత్కాలికవ్యాపారి, యిక్కడ నివసించని వ్యాపారి తరఫున పనిచేసే ఏజంటుగాక) సంవత్సరంలో జరిపిన మొత్తం వ్యాపారం రూ 10,000 తగ్గకుండావుంటే ఆవ్యాపారి (2) ప్రతి తాత్కాలికవ్యాపారి లేదా (3) నివసించని వ్యాపారి తరఫున పనిచేసే ఏజంటు, ఎంత వ్యాపారం జరిపినా, జరిపిన మొత్తం వ్యాపారంలో రూపాయికి రెండునయాపైసలు చొప్పున పన్ను చెల్లించాలి.

ఒకహోటలు, బోర్డింగుహౌసు, రెస్టోరెంటు, దుకాణం లేక తదితరస్థలంలో పానీయాలు లేదా ఆహారం లేదా రెండు

గాని సంబంధించిన వ్యాపారంలో, వ్యాపార మొత్తం 25,000 పైనవుంటే రూపాయకు 3 నయాపైసలు చొప్పున చెల్లించాలి.

(రూ 9–క్లాజు (1) ఫా (ఎ) లేక A–1 లేక A–2

2. ఒకటవ షెడ్యూలులో ఉదహరించిన ఏ సరుకులనైనా, మొట్టమొదటిసారిగా అమ్మినప్పుడు సబ్ సెక్షను (1) ననుసరించి ఆవ్యాపారి పన్ను చెల్లించాలి. ఆ వ్యాపారి ఆయా సరుకులలో వ్యాపారంచేస్తే సంవత్సరాంతంలో ఆషెడ్యూలు రేట్లప్రకారంకూడా వ్యాపారం మొత్తంపైనపన్ను చెల్లించాలి. సబ్ సెక్షను ఒకటి ననుసరించి చెల్లించవలసినపన్నుగాక ఆ వ్యాపారి పైపన్నును అదనముగా చెల్లించాలి.

(రూ, 9 క్లా (1) ఫా (A)

(3) సబ్ సెక్షను (1) లో ఏమివున్నప్పటికి యీచట్ట ప్రకారము దిగువనుదహరించిన పన్ను విధింపబడుతుంది.

3. (ఏ) రెండవషెడ్యూలులో ఉదహరించిన సరుకుల సందర్భములో జరిగిన అమ్మకంపై ఆయారేట్ల చొప్పున వ్యాపారి సంవత్సరాంతములో జరిపిన అమ్మకంపై ఆయా సరుకులలో ఎంత వ్యాపారం జరిపినాపన్ను చెల్లించవలసివుంటుంది.

3. (బి) మూడవషెడ్యూలులో నుదహరించిన సరుకుల సందర్భములో, రాష్ట్రములో నిర్దేశింపబడిన కొనుగోలుకు మాత్రం,ఆయారేట్లచొ॥నసంవత్సరములో జరిపిన కొనుగోలుకు మాత్రం, ఆయావస్తువులలో జరిపిన వ్యాపారం ఎంత అయినా పన్ను చెల్లించవలసివుంటుంది. (రూ9–క్లాజు (1) ఫాA)

4. ఈ చట్టంలోని యితర నిబంధనలు, యీా సెక్షనుకు అనువర్తింపజేయటానికి ఒకవ్యాపారి ఎంతమొత్తంపై పన్ను చెల్లించాలి అనే విషయంలో నిర్ణయింపబడిన విధా

నంలో జరిగిన వ్యాపారపు మొత్తంనుంచి ఆయా మొత్తాలను మినహాయించి పన్ను చెల్లించవలసిన మొత్తం నిర్ణయింప బడుతుంది.

(రూ. 6 క్లా (1) a, b, c, d, e, f, g, h, i, j, k, l.)

5. నిర్ణయింపబడిన విధానంలో పన్నులు విధింపబడి వసూలుచేయబడతాయి.

(1) నిర్ణయింపబడిన ఆయానిబంధనల ననుసరించి, సరుకులకు సంబంధించిన ఒకే వ్యవహారంలో కొనుగోలు దారు లేక అమ్మకందారు ఏ ఒకరికో ఒకరికి మాత్రం పన్ను విధింపబడుతుంది. ఇరువురకు పన్ను విధింపబడదు.

(2) క్లాజు 1 ననుసరించి వ్యాపారి కొన్నవస్తువులపై, పన్ను విధింపబడినప్పుడు ఆ వ్యాపారి ఆ వస్తువులు అమ్మినప్పు డు పన్ను చల్లించనక్కర లేదు.

## శెక్షను 6

ప్రకటింపబడిన వస్తువుల పన్ను: 5 వ శెక్షనులో ఏమి వున్నప్పటికి 4 వ షెడ్యూలులో తెలుపబడిన ఆయా వస్తువులతో వ్యాపారం ఎంత అయినప్పటికి అమ్మకం లేక కొను గోలు జరిగినప్పుడు మాత్రం ఒకవ్యాపారి "ప్రకటింపబడినవస్తు వుల" అమ్మకం లేక కొనుగోలుపై ఆయా రేట్లచొప్పున పన్ను చెల్లించవలసివుంటుంది. నిర్ణయింపబడిన విధానంలో పన్ను లెక్క వేయబడి వసూలు చేయుబడుతుంది.

## శెక్షను 7

ఎగమతి దిగుమతి సరుకులపై పన్ను విధించురీతి:-

7 (1) సరుకులు అమ్మకాలు లేక కొనుగోళ్ళు, వరసగా జరిగినప్పుడు సరుకులకు ఒకేసారి పన్ను విధింపబడుతుంది.

(ఎ) విదేశంనుంచిగాని, భారతదేశంలో మరోరాష్ట్రం నుంచిగాని, సరుకులు దిగుమతి అయినప్పుడు ఆవస్తువులు దిగిన వెంటనే జరిగిన అమ్మకం లేక కొనుగోలు జరిగినప్పుడు.

(బి) విదేశానికిగాని, భారతదేశంలో మరో రాష్ట్రానికి గాని ఎగుమతి అయినప్పుడు సరుకులు ఎగుమతి అయిన వెంటనే జరిగిన అమ్మకంపైగాని లేక కొనుగోలు జరిగినప్పుడుగాని, ఒకేసారి పన్ను విధింపబడుతుంది.

7 (2) శెక్షను క్రింద లేక 5 శెక్షనులో (3) వ సబ్ శెక్షను లేక (2) వ సబ్ సెక్షనుక్రింద పన్ను విధింపబడినప్పుడు అట్టిపన్ను విధింపకూడదని రుజువు చేసికొనవలసిన బాధ్యత ఆ యా వ్యాపారులపైనే వుంటుంది.

## శెక్షను 8

(8) కొన్ని సరుకులు పన్నునుండి మినహాయింపబడ్డాయి. లైసెన్సు, లైసెన్సుఫీజులకు వర్తించే షరతులకు నిబంధనలకు లోబడి, 5 వ షెడ్యూలులో తెలుపబడిన, సరుకులతో వ్యాపారంచేసేవ్యక్తి 5 శెక్షనుక్రింద, సరుకులకు పన్ను చెల్లించనక్కర్లేదు

## శెక్షను 9

9. (1) పన్ను తగ్గించటానికి, మినహాయించటానికి రాష్ట్రప్రభుత్వానికి వున్న అధికారము.

9 (1) ఈ చట్టాననుసరించి, చెల్లించవలసిన పన్ను రేటు తగ్గించేందుకు లేక కొన్ని సరుకులమీద పన్ను వేయకుండా మినహాయించుటకు రాష్ట్రప్రభుత్వానికి అధికారంవుంది. ఆయాతగ్గింపులు, మినహాయింపులు ఆంధ్రప్రదేశ్ గెజెట్టులో ప్రకటింపబడతాయి.

(i) ఒక ప్రత్యేక తరగతికి చెందిన సరుకుల అమ్మకం లేక కొనుగోలుపైన అనేకసార్లు లేదా ఒకేసారి వ్యాపారాలు వరుసగా కొనుగోళ్ళు లేదా అమ్మకాలు జరిపినప్పుడల్లా లేక

(ii) ఒక ప్రత్యేక తరగతి వ్యక్తులు, వారు జరిపిన వ్యాపారమొత్తమంతా లేదా కొంతభాగము.

(2) సబ్ సెక్షను 1 ననుసరించి చెల్లించవలసిన పన్నులో తగ్గింపు లేక పూర్తిగా మినహాయింపులు:-

(రూ 25 (4) ఫా viii )

(ఏ) రాష్ట్రమంతటికి, లేక ఒక ప్రాంతానికి, లేక కొన్ని ప్రాంతాలకు వర్తించవచ్చును.

(బి) ఆంధ్రప్రదేశ్ గెజెట్టులో ప్రకటింపబడిన, నిబంధనలకు, షరతులకు, లైసెన్సులకు, లైసెన్సుఫీజులకు సంబంధించిన షరతులకు లోబడి. (రూ 6 (1) A మొదలు C వరకు)

## శెక్షన్ 10

లైసెన్సు షరతులు మొదలయినవి పాటించని వ్యాపారులు పన్ను చెల్లించవలసిన బాధ్యతలు.

8 శెక్షను ప్రకారం లేక 9 వ శెక్షనుప్రకారం తెలుపబడిన నిబంధనలు, షరతులు ఒక వ్యాపారి పాటించకపోయినా, లైసెన్సుపొందాలని లేదా రెన్యూచేయాలనే నిబంధనలప్రకారం జరుపకపోయినా, లైసెన్సుషరతులను ఉల్లంఘించినా ఆ సంవత్సర ప్రారంభంనుంచీ ఆవ్యాపారిజరిపిన అమ్మకాలు లేదా కొనుగోళ్ళపైన 5 శెక్షను లేదా 6 శెక్షనుప్రకారం పన్ను విధింపబడుతుంది. పై వ్యాపారిజరిపిన అమ్మకాలు, కొనుగోళ్ళకు 8, 9 శెక్షన్లు, వర్తించనట్లు ఎంచబడుతుంది. లైసెన్సువున్నా

ఆ సంవత్సరంలో రిన్యూగా బడినా పైన తెలిపినట్లు 8,9 శెక్షన్ల ప్రకారము పన్ను విధింపబడుతుంది.

(రూ 30 ఫా B 5) (రూ 30 ఫా B 6)

## శెక్షను 11

ఏజంట్లకు లైసెన్సు మినహాయింపులు:-

(రూ 30 ఫా D 2 రూ ఫా D 3)

11. (1) ఒకవ్యక్తినిర్ణీత కమీషనుకు లేక బ్రోకరేజికి యజమానులతరఫున సరుకులు కొనటానికి లేదా అమ్మటానికి వారితరఫున పనిచేయటానికి అతడు ఏ యజమానులవద్ద పని చేస్తున్నారో వివరాలతో సహా రాష్ట్రప్రభుత్వ అధికారులకు అతను ఒక దరఖాస్తును నిర్ణీతఫీజుతో సహా పెట్టుకుంటే పన్నువిధింపు అధికారులు అతనికి లైసెన్సు యివ్వవచ్చును. ఈ వ్యక్తి 5 లేక 6 శెక్షనుప్రకారం పన్ను చెల్లించ నక్కరలేదని ప్రభుత్వము నిర్ణయించవచ్చును. స్వంతచేను, లేక తోటలో పండిన పంటను యజమానితరఫున అమ్మకంజరిగినప్పుడు అది వ్యాపారంక్రిందకురాదు. అయితే ఆ పంటలు పండినట్లుగానే అమ్మాలి. తినటానికి వీలుగా ఆయా పంటలను ఎట్టి భౌతిక, రసాయనిక లేక తదితరవిధంగామార్చి అమ్మరాదు. అయితే పంటలను బాగుచేసి తరగతివారీగా విభజించి అమ్మవచ్చును. అయితే యీఅమ్మకాలు లేక కొనుగోలు పన్నునుంచి మినహాయింపు పొందుటకు యజమానులు లెక్కలు తయారుచేయాలి. ఈ అమ్మకాలు, కొనుగోలులు చట్టప్రకారం పన్ను చెల్లించ వలసివచ్చినా యజమాని సరియగు లెక్కలు తయారుచేసి చూపాలి. (రూ 30 ఫా D 2)

ఈ శెక్షను ప్రకారం లైసెన్సు పొందిన ఏజంటు, యజమానులవద్దనుండి ఎట్టిఉత్తర్వు లేకుండా సరుకులుకొన్నా ఒక రేటుకుకొని మరో రేటుకు యజమానులకుయిచ్చినా, లేక ఒక రేటుకు సరుకులుఅమ్మి, మరో రేటుకు యజమానులకు పంపినా చేసిన వసూళ్ళను, తగ్గించిన మొత్తాలను, యజమానులకు సరియగు లెఖ్ఖలు చెప్పకపోయినా అసలు యజమానే లేక పోయినా, కల్పితయజమాని తరఫున వ్యాపారం జరిపినా, అతడు జరిపిన వ్యాపారానికి 5 లేక 6 శెక్షనుప్రకారం పన్ను చెల్లించవలసి వుంటుంది. (రూ 30-ఫా D 3)

ఈ శెక్షనుప్రకారం జరిపిన వ్యాపారానికి 5 శెక్షను లేదా 6 శెక్షను వర్తించదని పన్నునుండి మినహాయించాలని ఋజువుచేసికొనే బాధ్యత లైసెన్సుదారు పైన వుంది. (రూ 30 ఫా VII)

11 (2) ఇక్కడ నివసించని వ్యాపారితరఫున ఏజంటుకు ఈ శెక్షనుగాని యిందులోని నిబంధనలుగాని వర్తించవు.

## శెక్షను 12

### వ్యాపారుల రిజిస్ట్రేషను (రూ 28-29, ఫా D 1)

12 (1) ఎ. సంవత్సరానికి 7500 రూపాయలకు తగ్గని మొత్తపువ్యాపారం జరిపే ప్రతివ్యాపారి, యిక్కడ నివసించని వ్యాపారి తరఫున ఏజంటు, తదితర ఏవ్యాపారి అయినా ఈ చట్టప్రకారము వ్యాపారిగా రిజిస్టరు చేయించుకోవచ్చును.

(1) బి. ఆరురూపాయలు ఎక్కువగాని నిర్ణయించబడిన ఫీజు చెల్లించి, ఆయాప్రాంతాలలో, నియమింపబడిన అధికారికి తనను వ్యాపారిగా రిజిస్టరు చేయమని దరఖాస్తు పెట్టుకోవాలి.

(1) సి. రిజిస్ట్రరు అయిన సంవత్సరం నుంచి రద్దు అయ్యే వరకూ ప్రతి సంవత్సరం నిర్ణీతమైనఫీజు చెల్లిస్తూ వుండాలి.

(రూ 28 & 29 ఫా D)

(1) డి. రెండు సంవత్సరాలు వరుసగా ప్రతి సంవత్సరంలో జరిగిన వ్యాపారం రూ 7500 లకు తగ్గినట్లుగా ఆయా అధికారులకు తృప్తికరంగా వుండేటట్లు ఋజువుచేసికొంటే "ఏ" క్లాజు ననుసరించి రిజిస్ట్రేషను పొందినవ్యాపారి (ఇక్కడ నివసించని వ్యాపారితరఫున పనిచేయు ఏజంటుగాక) తన రిజిస్ట్రేషను రద్దు చేయించుకొనే హక్కు గలిగివుంటాడు.

12 (2) ఎ. సబ్ సెక్షను (1) లో ఏమివున్నప్పటికి 2, 3, 4 షెడ్యూళ్లలో ఉదహరించిన సరుకులన్నింటితో లేదా కొన్నింటితో వ్యాపారంచేసే ప్రతివ్యాపారి తాను సంవత్సరంలో ఎంత వ్యాపారం జరిపినా అతను వ్యాపారిగా రిజిస్ట్రరు చేయించుకోవాలి. అయితే ఒక చిన్న బంకులో పనిచేసేవ్యక్తికిగాని, వీధుల వెంట తిరిగి వ్యాపారం చేసికొనేవారుగాని, లేక రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన తదితర వ్యాపారంచేసే వ్యక్తులుగాని, వ్యాపారిగా రిజిస్ట్రరుచేయించుకో నవసరములేదు.

ఈక్లాజుకు వివరణ:

(1) ఒక చిన్న బంకులో వ్యాపారంచేసేవ్యక్తి అంటే 64 చదరపు అడుగులస్థలంలో లేక దుకాణంలో వ్యాపారం చేసేవారు అని అర్థం. యిట్టి వ్యాపారులవద్ద ఎట్టి నవుకర్లు వుండరు. ఈ వ్యక్తి రాష్ట్రంలో రిజిస్ట్రరుచేయించుకున్న వ్యాపారులవద్దనుంచే సరకులు కొంటూవుంటాడు.

(2) బజారువెంట తిరిగి అమ్మే వ్యక్తి అంటే సరుకులను మోస్తూ యింటి యింటికి తిరిగి అమ్ముకునే వ్యక్తి అని

అర్థం. ఈ వ్యక్తికూడ రాష్ట్రములో రిజిస్టరు అయినవర్తకుల నుంచే సరుకులు కొంటూవుంటాడు.

(2) బి. ఆరు రూపాయల ఫీజు చెల్లించి చట్టప్రకారం నియమింపబడ్డ అధికారులవద్ద వ్యాపారిగా రిజిస్టరు చేయమని దరఖాస్తులు చేయాలి.

(2) సి. దాఖలుకాబడ్డ దరఖాస్తును ఆయా అధికారులు విచారించి వారికి సంతృప్తికరంగాను సక్రమంగాను వున్నట్లుగా నమ్మితే వారు నిర్ణయించబడిన ఫారములో సర్టిఫికెట్టును జారీచెస్తారు. (రూ 28 అండ్ 29 ఫా D 1)

(2) డి. ఒక వ్యాపారికి ఒకటికిమించి అనేకదుకాణాలు వుంటే (సరుకులు నిలువచేసే చోటుగాక) ఒక్కొక్కచోటుకు ఒక్కొక్క ప్రత్యేక సర్టిఫికెట్టును పొందాలి. (ఫా xiv)

(2) యి. చట్టప్రకారం నియమింపబడిన ఆయా ఉద్యోగులు సకారణంగా ఈ క్రింది విధంగా చేయటానికి అధికారం కలిగివుంటారు.

2. యి. (1) తాను జారీచేసిన ఏ సర్టిఫికెట్టునైనా సరియైన, పూర్తియైన కారణములు ఉన్నయెడల రద్దుచేయవచ్చును. మార్చవచ్చును. లేక సవరించవచ్చును.

(2) రిజిష్టరు అయిన లేదా రిజిష్టరుచేయమని పెట్టబడిన దరఖాస్తుదారుని ఈ సబ్ సెక్షను ప్రకారం సంవత్సరంలో జరుగబోవు వ్యాపారాన్ని ఉజ్జాయింపుగా లెఖ్ఖగట్టి ఆ వ్యాపారంపై విధింపదగిన పన్నుల్లో సగభాగం ముందుగా సెక్యూరిటీగా చెల్లించమని అధికారులు ఆదేశించవచ్చును.

(2) ఎఫ్. ఈ సబ్ శెక్షనుక్రింద రిజిస్ట్రేషను చేయమని పెట్టబడిన దరఖాస్తు నిరాకరింపబడదు గాని ఆయా వ్యాపా

రులు చెప్పుకొనేది విన్నపిదపనే 2 (ఇ) ననుసరించితగిన ఉత్త ర్వులు జారీచేయబడుతవి.

(2) జి. రిజిష్టరు అయిన సంవత్సరంతరువాత ప్రతిసంవత్సరం, రిజిస్ట్రేషను రద్దు అయ్యేవరకూ వ్యాపారి నిర్ణీతమైన ఫీజు చెల్లిస్తూవుండాలి. ఏ సంవత్సరంలోనైనా వ్యాపారం చేయటం ఆపితే ఆవ్యాపారి మరుసటిసంవత్సర ప్రారంభం నుంచీ తిరిగి వ్యాపారం చేసేవరకూ రిజిస్ట్రేషనుఫీజు చెలించ నక్కరలేదు.

(3) సబ్ శెక్షను (2) ప్రకారం రిజిష్టరుచేయించుకున్న వ్యాపారి రెండు, మూడు, నాలుగు షెడ్యూళ్ళలో తెలిపిన సరుకులను అన్నింటిలోగాని లేక కొన్నింటిలోగాని వ్యాపారము చేస్తూవుంటే సబ్ శెక్షను 1 ననుసరించి వ్యాపారిగా రిజిస్టరు చేయించుకోవలసిన అవసరం వుండదు.

(రూ 28 ఫా 29 & D 1)

## శెక్షను 13

### వ్యాపారి పంపవలసిన రిటరన్‌లు.

ఈ చట్టప్రకారం పన్ను చెల్లించవలసిన ప్రతివ్యాపారి నిర్ణీతకాలంలో ఆయా అధికారులకు వ్యాపారమునకు సంబంధించిన రిటరన్‌లు పంపాలి.

(రూ 9 లేక ఫా 1 & 2 ఫా A లేక A 2)

## శెక్షను 14

[ఫారం XIII]

పన్నునిర్ణయము : 1 13. వ శెక్షను ప్రకారం దాఖలు చేసినరిటరన్‌సరైనదని పూర్తిగావుందని సంతృప్తిచెందినపిమ్మట

దానిని ఆధారంచేసికొని పన్నువిధించే అధికారులు కట్టవలసిన పన్నును నిర్ణయిస్తారు. అయితే ఆ రిటరన్ సక్రమంగాగాని, పూర్తిగాగాని లేదని అధికారి అభిప్రాయపడితే, అది సక్రమమయినదేనని పూర్తిగావుందని ఋజువుచేసికోనేందుకు వ్యాపారికి పూర్తిఅవకాశం ఇవ్వాలి. వ్యాపారి చెప్పిందివిని, విచారణ చేసి, అధికారి ఉచితమని భావించినరీతిన ఇంతపన్ను చెల్లించాలి! అని నిర్ణయిస్తారు. పన్నువిధించే సంవత్సరం అంతమైనప్పటి నుంచి నాలుగు సంవత్సరాలకాలం మించకుండా, పన్నువిధింవ తగిన సంవత్సరంయొక్క లెఖ్ఖలు చూడవచ్చును. లెఖ్ఖలు చూచి ఎంత పన్ను విధించాలో నిర్ణయింపబడవచ్చును.

(రూ 13 ఫా B 2 & 2-3 ఫా B-1)

(2) తనకు న్యాయమని తోచిన దానికి పన్ను వేయునప్పుడు రిటరునులో చూపించని వ్యాపారం మొత్తముపై చెల్లించవలసిన పన్నుకు ఒకటిన్నర రెట్లు మించకుండా ఆయా అధికారులు అపరాధం విధించటానికి హక్కు కలిగివుంటారు. ఈ అపరాధం సబ్ శెక్షన్ (1) ననుసరించి ఎంతమొత్తం పన్ను క్రింద నిర్ణయించాలో అధికారులు విచారించినిర్ణయించిన మొత్తమునకు అదనంగా వ్యాపారి చెల్లించాలి.

(3) ఈ చట్టప్రకారం పన్ను చెల్లించ వలసిన ఏ వ్యాపారిఅయినా నిర్ణీతకాలంలో ఆయాఅధికారులకు రిటరనులు సమర్పింపకుండా వుంటే, పన్నుకు సంబంధించిన సంవత్సరం అంతమైన నాలుగు సంవత్సరాల లోపల ఎప్పుడైనా వ్యాపారికి నోటీసు జారీచేసి అవసరమనుకున్న విచారణజరిపి ఉచితమని భావించిన పన్నులను ఆయా సంవత్సరాలలో జరిపిన వ్యాపారంపై ఆయా అధికారులు విధించవచ్చు. ఇంతేగాక

విధింపబడినపన్నుకు ఒకటిన్నర రెట్లు మించకుండా అపరాధము కూడా అదనంగా విధింపబడుతుంది.

(4) ఒక వ్యాపారి జరిపిన వ్యాపారంలో యేకారణం చేత నైనా పన్ను పడకుండా తప్పిపోతే లేక తక్కువపన్ను పడితే లేక లైసెన్సుఫీజు కట్టకుండా తప్పించుకుంటే లేక రిజిస్ట్రేషనుఫీజు తక్కువ రేటుకు కట్టివుంటే పన్నుకు లేక లైసెన్సుఫీజుకుసంబంధించిన సంవత్సరము అంతమైన నాలుగు సంవత్సరాలలోపల వ్యాపారికి ఒకనోటీసును జారీచేసి అవసరమైన అన్నివిచారణలు జరిపి సరియైనపన్ను, సరియైనలైసెన్సుఫీజు నిర్ణయించి ఆయా అధికారులు తిరిగి పన్నులను విధించవచ్చును. వ్యాపారి జరిపిన వ్యాపారమొత్తాన్ని తెలుప నందువల్లగాని, పన్నుకట్టడం తప్పించుకున్నందువల్లగాని లేక తక్కువ రేటుచొప్పున పన్ను విధింపబడినందువల్లగాని, ఆయా అధికారులు తిరిగినిర్ణయించిన పన్నుకు ఒకటిన్నర రెట్లు మించకుండా అదనముగా జరిమానా విధించి అదికూడా వ్యాపారి చెల్లించాలని ఆదేశించవచ్చును.

సబ్ శెక్షను (2) సబ్ శెక్షను (3) లేక సబ్ శెక్షను (4) ననుసరించి ఆయా అధికారులు చర్యతీసికొనుటకు పూర్వం సరియైన సమాచారం తెలుపకుండా యెందుకు దాచవలసివచ్చిందీ తగుసమాధానము, సంజాయిషీ యివ్వవలసిందని వ్యాపారికి నోటీసు జారీచేస్తారు. వ్యాపారి సంజాయిషీ యిచ్చుటకు తగు అవకాశాలు అధికారులు కలుగజేస్తారు. అవసరమనుకొన్న విచారణలన్ని జరుపుతారు.

## శెక్షను 15

ఉజ్జాయింపు పన్ను:-

(1) ఈచట్టప్రకారం ప్రతివ్యాపారి చెల్లించవలసిన పన్ను

ప్రతిసంవత్సరము ముందుగా నెలసరి లేక ఇతర నిర్ణీత వాయిదాలలో చెల్లించాలని ఉజ్జాయింపుగా నిర్ణయించవచ్చు. ఈ నిర్ణయాకి వ్యాపారియొక్క నికరవ్యాపారము లేక అంచనా వ్యాపారాన్ని ఆధారం చేసికోవచ్చు. దీనికిగాను నిర్ణీతమైన పద్ధతులలో అంచనా లేక నికరవ్యాపారానికి సంబంధించిన రిటరన్‌ను పంపమని వ్యాపారిని ఆదేశించవచ్చును.

(రూ 13 ఫా B రూ 17 ఫా B-2)

(2) ఇట్టివిధమైన ఉజ్జాయింపు పన్ను కొంతకాలంతర్వాత తక్కువ వ్యాపార మొత్తానికి లేదా తక్కువ రేటుచొప్పున, లేక ఎక్కువ వ్యాపార మొత్తానికి లేక ఎక్కువ రేటుచొప్పున "ఉజ్జాయింపుగా పన్ను విధింపబడిందని" పన్ను విధించే అధికారి అభిప్రాయపడితే ఆయన అట్టి ఉజ్జాయింపుపన్ను హెచ్చించవచ్చును లేదాతగ్గించవచ్చును. అయితే అట్టివిధంగా హెచ్చించే ముందు వ్యాపారికి ఒకనోటీసును ఆయాఅధికారులు యివ్వాలి. ఉచితమనుకొన్న విచారణను పూర్తిగాజరపాలి. అయితే అంతకుపూర్వపు సంవత్సరములో ఆఖరిసారిగా నిర్ణయించబడిన వ్యాపార మొత్తాన్ని ఆధారంగాచేసికొని పన్ను హెచ్చిస్తే వ్యాపారికి ప్రత్యేకంగా నోటీసు యివ్వనక్కరలేదు.

(3) ఉజ్జాయింపుగా విధింపబడ్డపన్ను, సంవత్సరంలో నెలసరి లేక తదితర నిర్ణీతవాయిదాలలో వసూలుచేయవచ్చును.

(రూ 15 ఫా B 1)

## శెక్షను 16

( ఫా XIII )

16. చట్టప్రకారము చెల్లించవలసిన పన్ను, యితర బాకీలు:- (రూ 15, 17, 50 – ఫా B 3)

(1) ఈ చట్టప్రకారము చెల్లించవలసిన పన్నూ, 14 వ శెక్షను 2, 3, 4 సబ్ శెక్షన్ల ప్రకారము విధింపబడిన అపరాధమును నిర్ణయించినకాలంలో ఆయావద్ధతులలో చెల్లించాలి. పన్ను సందర్భంలో నోటీసు అందిన 15 రోజుల లోగాను, అపరాధము సందర్భంలో నోటీసులో ఉదహరించిన కాలంలో వ్యాపారి ఆయామొత్తాలు కట్టాలి.

(రూ 14 - ఫా B IV)

(2) విధింపబడిన పన్నూ లేక అపరాధము లేక రెండూ, రెండు లేక అంతకుమించిన వాయిదాలో చెలించవచ్చునని రెవిన్యూబోర్డుసాధారణ లేక ప్రత్యేక ఉత్తర్వులద్వారా అనుమతింపవచ్చును.

(3) ఈ చట్టముక్రింద విధింపబడినపన్ను లేక జరిమానా విధించుచూ యివ్వబడిన నోటీసులో నిర్ణయించిన కాలంలోపల పన్నులు చెల్లించాలి. అట్టివిధంగా చెల్లించకపోతే ఈ క్రింద తెలిపినవిధంగా అపరాధము చెల్లించవలసి వుంటుంది.

(3) ఎ. చెల్లించటానికి నిర్ణయించిన తేదీ తరువాత మొదటి మూడు నెలలకు, ప్రతినెలకు లేక నెలలో భాగానికి ఆ మొత్తానికి నెలకు రు 0-8-0 చొప్పున,

(3) బి. పైనుదహరించిన మూడు నెలల తరువాత, ప్రతి నెలకు లేదా నెలలో భాగానికి ఆ మొత్తానికి నెలకు నూటికి రు 1-0-0 చొప్పున,

(4) ఈ చట్టప్రకారము చెల్లించవలసిన పన్ను లేక అపరాధము లేక వాయిదా మొత్తము లేక లైసెన్సు లేక రిజిస్ట్రేషనుఫీజు నిర్ణయింపబడిన కాలంలో వ్యాపారి చెల్లించక

పోతే అప్పటివరకూ బాకీపడ్డ మొత్తమంతా భూమిపన్ను బకాయివలె ఎంచబడి వసూలు చేయబడుతుంది.

(5) సబ్ శెక్షను (4) ననుసరించి, పూర్తిమొత్తం వసూలుచేయటానికి లేక యీ చట్టప్రకారం ఏదైనా నేరం జరిగితే, ఆ నేరంపై తగినచర్య తీసికోటానికి ఈ చట్టం ననుసరించి విధింపబడిన అపరాధమువల్ల ఎట్టి అడ్డంకిలేదు.

## శెక్షను 17

ఒక వ్యాపారస్తునకు యితర వ్యక్తులనుంచి రావలసిన మొత్తాలను, పన్నులు యితర బకాయిల నిమిత్తము వసూలు చేయటం:-

(1) ఒకవ్యాపారి చెల్లించవలసిన పన్నులు అపరాధములు లేక లైసెన్సుఫీజులు బకాయిపడితే, ఆ వ్యాపారికి, ఏవ్యక్తిఅయినా యివ్వతేలిన మొత్తాలను, బకాయిమొత్తం మేరకుగాని, అంతకు తగ్గిన మొత్తంగాని (ఆవ్యక్తి ఈ వ్యాపారికి యివ్వవలసింది తేలినపిమ్మట) ఎప్పుడయినా లేక అప్పుడప్పుడు ఆవ్యక్తికి వ్రాతమూలకంగా నోటీసును జారీ చేసి (నోటీసుకాపీ వ్యాపారికి పంపబడుతుంది) తక్షణం లేక నోటీసులో ఉదహరించిన కాలంలో, ఆయా మొత్తాలు, తనకు చెల్లించాలని ఆదేశిస్తూ నోటీసులు పంపుటకు ఆయా పన్ను విధింపు అధికారులకు హక్కువుంది.

(2) పన్ను విధించే అధికారికి ఎప్పుడైనా లేక అప్పుడప్పుడు పైప్రకారం యిచ్చిన నోటీసు రద్దుచేయవచ్చును లేక నోటీసులో ఉదహరించిన కాలాన్ని పొడిగించవచ్చును.

(3) పైవిధంగా నోటీసు అందుకొన్నవ్యక్తి సొమ్ము చెల్లించే యెడల ఆసామీకి చెల్లించి రశీదు పొందినట్లే

ఎంచబడును, తాను చెల్లించుమేరకు ఆసామీకి యివ్వవలసిన బాకీ రద్దుఅగును.

(4) పై విధంగా నోటీసు అందుకున్న ఆ వ్యక్తి వ్యాపారికి తను ఇవ్వవలసిన బాకీ మొత్తాన్ని చెల్లించిన ఆ మొత్తం వ్యాపారి బకాయిబడ్డపన్ను, అపరాధము లేక లైసెన్సు ఫీజులయొక్క మొత్తం ఈ రెండు మొత్తాలలో ఏది తక్కువ అయితే ఆ మొత్తం పన్నువిధించే అధికారికి ఆ వ్యక్తి, వ్యక్తిగతంగా చెల్లించుకునే బాధ్యత వుంది.

(5) పై విధంగా నోటీసు అందుకున్న వ్యక్తి పన్ను బకాయిపడ్డ వర్తకునకు తను ఏవిధంగా అంతగాని కొంతగాని బాకీలేనట్లుగా పన్ను విధించే అధికారికి సంతృప్తికరమైన విధానంలో ఋజువుచేస్తే ఈ శెక్షను ప్రకారము ఇవ్వబడ్డ నోటీసు ననుసరించి, ఆ వ్యక్తిఏమీ చెల్లించనక్కరలేదు.

(6) ఈ శెక్షనులోని క్లాజులు, వ్యాపారి బకాయి పడ్డ పన్నులు జరిమానాలు లేక ఫీజులు వసూలు చేయటానికి తీసుకునే ఇతర చర్యలకు ఎట్టిభంగం కలుగజేయవు.

## శెక్షను 18

వ్యాపారం యితరులకు స్వాధీనము చేసినప్పుడుపన్ను వసూలు:-

ఒకవ్యాపారి తన వ్యాపారమును, మరొకరికి స్వాధీనము చేస్తె ఆ తేదీనాటికి పన్ను చెల్లించక నిలిచిపోతే అట్టి బకాయిపన్నులను కొత్తయజమాని చెల్లించవలసివస్తుంది. అయితే పాతయజమానివద్దనుంచి బకాయిపన్ను వసూలు

చేసేందుకు తీసుకునే యితర చర్యలకు దీనివల్ల ఎట్టి అభ్యంతరం వుండదు.

## శెక్షను 19

అప్పీళ్ళు: (1) ఈ చట్టాననుసరించి ఏ అధికారైనా జారీచేసిననోటీసు దానిమీద జరిగినచర్య న్యాయంగా లేదని అనుకుంటే అట్టినోటీసు లేదా చర్యనుగూర్చి ఆ వ్యాపారి నోటీసు అందుకున్న 30 రోజులలోగా నిర్ణయింపబడిన అధికారులవద్ద అప్పీలు చేసికొనవచ్చును. (రూ 33—ఫా 1)

(ఎ) ఏ వ్యాపారిఅయినా 30 రోజుల తరువాత అట్టి అప్పీలుచేస్తే అంత కాలం దాటినపిమ్మట అప్పీలుచేయుటకు తగు కారణాలను తృప్తికరంగా ఋజువుచేస్తే అప్పిలెట్ అధికారులు అట్టి అప్పీలును దాఖలు చేసికొనవచ్చును.

(బి) విధింపబడినపన్ను, లేక అపరాధము వుంటే అదీ, వాయిదాల పద్ధతితో చెల్లించే మొత్తాలు చెల్లించకుండా వుంటే అదీ, చెల్లించినట్లు ఋజువుచేసికొనే సాక్ష్యంవుంటే అదీ అప్పీలు దరఖాస్తుతో బాటు వాటినికూడా దాఖలుచేస్తేనే గాని పన్ను విధింపు ఉత్తర్వుపై చేసిన అప్పీలు దరఖాస్తు దాఖలు చేసికోబడదు. కాని అప్పిలెట్ అధికారులకు ఉచితమనితోస్తే విధింపబడినపన్ను లేక అపరాధము అంతగాని లేదా కొంతమొత్తంగాని చెల్లించకుండా ఆవుదలచేస్తూ ఉత్తర్వులను జారీచేయవచ్చును.

(2) అప్పీలు దరఖాస్తు నిర్ణయింపబడిన నమూనాలో నిర్ణయించిన విలువగల కోర్టుఫీజు స్టాంపులు అతికించి దాఖలు చేయాలి.

(సి) నిర్ణయింపబడిన నిబంధనల ననుసరించి, అప్పిలెట్ అధికారులు, వ్యాపారి చెప్పుకునేది విని:

(ఎ) పన్ను, లేక అపరాధము లేక రెండింటినీ ఖాయ పర్చవచ్చు, తగ్గించవచ్చు హెచ్చించవచ్చు, లేదా పూర్తిగా రద్దుచేయవచ్చు లేక-

(బి) పన్ను లేక అపరాధము లేక రెండింటినీ కొట్టివేసి, తిరిగి విచారణ జరుపవలసిందిగా పన్ను విధించే అధికారికి కొత్తగా ఉత్తర్వులను జారీచేయాలని నిర్ణయింపవచ్చు లేక-

(సి) ఉచితమని భావించినరీతిని, యితర ఉత్తర్వులు కూడా జారీచేయవచ్చును.

(4). సబ్ శెక్షను (3) ప్రకారం అప్పిలేట్ అధికారులు, ఉత్తర్వులను జారీచేయుటకుముందు అప్పీలులోని విషయాలు విచారించి, రిపోర్టు పంపమని క్రింది అధికారిని లేదా మరో వర్గాన్ని ఆదేశించవచ్చు లేదా ఉచితమనితోస్తే స్వయంగా విచారణ జరుపవచ్చును.

(5). ఈ శెక్షనుక్రింద అప్పీలులో జారీచేసిన ప్రతి ఉత్తర్వు 20, 21, 22, 23 శెక్షన్లకు లోబడికడపటి ఉత్తర్వుగా ఎంచబడుతుంది.

## శెక్షను 20

రెవిన్యూబోర్డు తదితర అధికారవర్గానికి (రివిజను) పునర్విమర్శనాధికారము:-

(1) ఈ శెక్షనులోని, సబ్ శెక్షను (2) తోసహా ఈ చట్టాన్ననుసరించి క్రిందిఅధికారులు లేక అధికారి జారీచేసిన ఉత్తర్వులు లేక చర్యలకు సంబంధించిన రికార్డులు తెప్పించు

కని అట్టివిధంగా జారీచేసిన ఉత్తర్వులు లేక చర్యలు న్యాయ శాస్త్రసమ్మతంగా సక్రమంగా వుందా, లేదా అనువిషయా లనుగురించి రెవిన్యూబోర్డువారు విచారణ జరుపవచ్చు. పిమ్మట తగినరీతి ఉత్తర్వులను జారీచేయవచ్చు.

(2) డిప్యూటీ కమీషనర్లకు కమర్షియల్ టాక్సు ఆఫీసర్లకుకూడా 1 వ సబ్ శెక్షనులో ఉదహరించిన అధికారములు, వారిక్రింద అధికారులు లేక వ్యక్తులు తీసికున్నచర్యలకు, యిచ్చిన ఉత్తర్వులకు సంబంధించిన, విచారణ జరిపేందుకు అధికారము కలిగివుంటారు.

(3). ఈ చట్టాన్ననుసరించి పన్ను విధించిన ఉత్తర్వు సందర్భంలో (1) (2) సబ్ శెక్షన్లప్రకారము "సంక్రమించే అధికారాలు" పన్ను విధింపు ఉత్తర్వును, వ్యాపారికి జారీ చేసిన తేదీలగాయితూ నాలుగు సంవత్సరాలకు మించకుండా పునర్విమర్శించే అధికారమును చెలాయించవచ్చును.

(4) 1, 2, సబ్ సెక్షన్లప్రకారము పన్ను హెచ్చింపు చేసే సందర్భములో, హెచ్చించటానికి వీలులేదని వ్యాపారి చెప్పుకొనుటకు అవకాశమివ్వనిదే అట్టిఉత్తర్వులు యివ్వ కూడదు.

## శెక్షను 21

అప్పిలేట్ ట్రిబ్యూనలుకు అప్పీలు:- (రూ 38 ఫా II)

(1) ఈ క్రిందనుదహరించిన అధికారిజారీచేసిన ఉత్తర్వు, లేక తీసుకున్న చర్యపట్ల ఏ వ్యాపారి అయినా అభ్యంతరం తెలుపదలిస్తే-

(ఎ). 19 వ శెక్షను ప్రకారం అప్పీలు విచారించిన అధికారి, లేక–

(బి). 20 వ శెక్షనులోని (2) వ సబ్ శెక్షను ప్రకారం తనంతటతాను విచారణజరిపిన డిప్యూటీకమీషనర్, జారీచేసిన ఉత్తర్వు, లేక తీసుకున్నచర్య వ్యాపారికి తెలిసినతేదీ లగాయతు 60 రోజులలోపల అప్పిలెట్ ట్రిబ్యూనల్‌కు అప్పీలు చేసికొనవచ్చును.

(2) పై 60 రోజులు గడువు దాటినపిమ్మట అప్పీలు దాఖలుచేస్తే, అలాదాఖలుచేయటానికి సరైన కారణాలున్నాయని అప్పిలెట్ ట్రిబ్యూనల్ సంతృప్తిపడితే అప్పీలును అప్పిలెట్ ట్రిబ్యూనలు దాఖలుచేసుకొంటుంది.

(3) అప్పీలు దరఖాస్తు నిర్ణీతనమూనాలో, నిర్ణీతమైన పద్ధతిలో నూరురూపాయిలకు మించకుండా నిర్ణయింపబడేఫీజు కట్టి దాఖలుచేయాలి.

(4) ఎ. అప్పిలెట్ ట్రిబ్యూనల్ అప్పీలులోని ఇరు పక్షాలవాదాన్ని వినుటకు అవకాశముయిచ్చి,

(i) విధించినపన్ను, లేక అపరాధము లేక రెంటినీ ఖాయ పరచవచ్చు, తగ్గించవచ్చు, హెచ్చించవచ్చు లేక పూర్తిగా రద్దుచేయవచ్చు.

(ii) పన్ను లేక అపరాధము లేక రెంటినీ కొట్టివేసి తిరిగి విచారణ జరపాలని పన్ను విధించే అధికారికి కొత్తగా ఉత్తర్వు జారీచేయాలని నిర్ణయించవచ్చు; లేక–

(iii) తమకు ఉచితమని భావించినరీతిని ఏ ఇతర ఉత్తర్వులుకూడా జారీచేయవచ్చు.

అప్పీలు ఒక న్యాయశాస్త్రాంశానికి చెందినదై ఉండి, ఈ అంశాన్ని హైకోర్టు, లేక సుప్రీముకోర్టు విచారించి తీర్పు చెప్పకుండా ఉన్నకాలంలో అప్పీలు దాఖలుచేయబడితే, ఆ తీర్పు వచ్చేవరకు అప్పిలెట్ ట్రిబ్యూనల్ ఈ అప్పీలును విచారించకుండా ఉండవచ్చు.

(5). సబ్ శెక్షన్ (4) ప్రకారం అప్పిలెట్ ట్రిబ్యూనల్ ఉత్తర్వులు జారీచేసేముందు తమకు ఉచితమని తోచిన విచారణ జరుపవచ్చు లేక ఆయా విషయాలను విచారించి రిపోర్టు పంపాలని లేక విచారణ జరపాలని అప్పీలు అధికారిని, (ఈ అధికారి తీర్పుపైనే ప్రస్తుత అప్పీలు దాఖలు చేయబడింది) లేక పన్ను విధించే అధికారిని ఆదేశించవచ్చు; లేక ఉచితమని భావించిన తదితర విచారణలు జరుపవచ్చు,

(6) విధింపబడ్డ పన్ను, 19వ, 20వ శెక్షనుల ప్రకారం ఏదైనా అపరాధము ఉంటే అదీ, లేక ఏ వాయిదా మొత్తమైనా చెల్లించకుండా ఉంటే అదిచెల్లించినట్లు ధృవపడే సాక్ష్యం అప్పీలు దరఖాస్తుతో దాఖలు చేయబడితేనేగాని అప్పీలును దాఖలు చేసుకోరు.

(7) ఈ నియమావళి ననుసరించిగాక ఇతరత్రా అప్పిలెట్ ట్రిబ్యూనల్ అప్పీలులోని ఏపక్షానికీ ఖర్చులనుగూర్చి ఎట్టి ఉత్తర్వులను జారీ చేయటానికి అధికారము వీలులేదు.

(8) సబ్ శెక్షన్ (4) ప్రకారం అప్పిలెట్ ట్రిబ్యూనల్ జారీచేసిన ప్రతిఉత్తర్వు వ్యాపారికి, ఏ అధికారి ఇచ్చిన ఉత్తర్వుపై అప్పీలు చేయబడిందో ఆ అధికారికి, రెవిన్యూబోర్డుకు, నిర్ణయింపబడే తదితర అధికారవర్గనికీ అందజేయబడుతుంది.

(9) సబ్ శెక్షను (4) క్రింద అప్పిలెట్ ట్రిబ్యూనల్ జారీచేసే ప్రతిఉత్తర్వు 22వ శెక్షనులోని క్లాజులకు లోబడి కడపటి ఉత్తర్వుగా ఉంటుంది.

## శెక్షను 22

(రూ 40 —ఫా III)

హైకోర్టు రివిజన్:- (1) 21 వ సెక్షను 4 వ సబ్ శెక్షను ప్రకారం అప్పిలెట్ ట్రిబ్యూనల్ యిచ్చిన ఉత్తర్వు న్యాయంగా లేదని, లేక ఒక న్యాయశాస్త్రాంశాన్ని నిర్ణయించలేకపోయిందనీ, ఈ అప్పీలులోని వ్యాపారి, లేక దీనికిగాను నిర్ణయించబడ్డ అధికారి, ఉత్తర్వు అందిన తేదీ మొదలు 90 రోజులలోపల హైకోర్టుకు దరఖాస్తు పెట్టుకోవచ్చును.

ఈ దరఖాస్తును. 90 రోజులు దాటిన పిమ్మట దాఖలు చేస్తే, ఇలా దాఖలుచేయటానికి సరైన కారణాలున్నాయని సంతృప్తికరంగా హైకోర్టు అభిప్రాయపడితే హైకోర్టు అటువంటి దరఖాస్తును దాఖలు చేసికొనవచ్చును.

(2) దరఖాస్తు నిర్ణీత నమూనాలో ఉండాలి: నిర్ణీత పద్ధతిలో పరిశీలింపబడాలి; వ్యాపారిదరఖాస్తు పెట్టుకుంటే దరఖాస్తుతోపాటు నూరురూపాయలు ఫీజుక్రింద చెల్లించాలి.

(3) హైకోర్టు ఈదరఖాస్తును పరిశీలించి అప్పిలెట్ యిచ్చిన ఉత్తర్వులో జోక్యం కలుగజేసుకోటానికి సరైన కారణాలు కనుపించవని దరఖాస్తును వెంటనే కొట్టివేయవచ్చును. దరఖాస్తుదారుకు ఈ సందర్భంలో చెప్పుకునేందుకు అవకాశం కలుగజేసి, ఆయన చెప్పిందిపూర్తిగా విన్న పిమ్మటే, దాఖలు చేయబడ్డ అట్టి దరఖాస్తు కొట్టివేయబడుతుంది.

(4) ఎ. హైకోర్టువారు దరఖాస్తును వెంటనే కొట్టివేయని యెడల ఉభయపక్షాల వాదాన్ని విని హైకోర్టు అప్పీలులోని న్యాయ శాస్త్రాంశాన్ని నిర్ణయించాలి. అప్పిలేట్ట్రిబ్యూనల్ యిచ్చినఉత్తర్వులను హైకోర్టు వ్యతిరేకంగా మార్చవచ్చు లేక ఖాయపరచవచ్చు లేక సవరించవచ్చు లేక అప్పీలులో తెలుపబడిన ఆయా న్యాయశాస్త్రాంశంపై అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ దరఖాస్తును అప్పిలెట్ ట్రిబ్యూనల్‌కు తిరిగి పంపవచ్చు; లేక ఈ దరఖాస్తుపై హైకోర్టు తాము ఉచిత మని భావించిన యితర రీతిని ఉత్తర్వు జారీచేయవచ్చు.

(బి) 4 (ఎ) క్లాజు ననుసరించి, హైకోర్టు తమ అభి ప్రాయాన్ని అందజేసినప్పుడు అప్పిలెట్ ట్రిబ్యూనల్ లోగడ జరీచేసిన ఉత్తర్వును, హైకోర్టువారు అభిప్రాయానుసారం సవరించవలయును.

(5) సబ్ శెక్షను (4) ప్రకారం హైకోర్టు ఉత్తర్వు జారీ చేసేముందు, అవసరమనుకుంటే, ఒక ప్రత్యేక న్యాయ శాస్త్రాంశంపైన లేక ఒక సారాంశంపైన లేక అభిప్రాయం తెలుపవలసిందని అప్పీలుదరఖాస్తును అప్పిలెట్ ట్రిబ్యూనల్‌కు పంపవచ్చును.

(6) సబ్ శెక్షను (1) ననుసరించి దరఖాస్తు దాఖలు చేయబడ్డప్పటికీ వ్యాపారికి విధింపబడిన పన్నంతా కట్టాలి.

అయితే హైకోర్టు యుక్తమని భావిస్తే దరఖాస్తుదారు ఆ పన్నును ఇన్నివాయిదాలలో లేక తదితర పద్ధతిలో చెల్లిం చాలని ఆదేశించవచ్చు. దరఖాస్తు పెట్టుకున్నందువల్ల పన్నులో ఏదైనా మార్పు అవసరమైతే పన్ను విధించే అధి కారిని అట్టిమార్పు పన్నులో చేయమని హైకోర్టు ఆదేశిస్తుంది;

అటువంటి మార్పు జరిగిన పిమ్మట అదనంగా చెల్లించిన మొత్తం దరఖాస్తుదారుకి వాపసు చేయబడుతుంది; అలాగాక దరఖాస్తుదారు మరికొంత చెల్లించవలసివస్తే ఈ చట్టప్రకారం ఆ దే మొత్తం దరఖాస్తుదారువద్దనుంచి వసూలు చేయబడుతుంది.

(7) (ఏ) 4 వ సబ్ శెక్షనుక్రింద హైకోర్టు జారీచేసిన ఉత్తర్వు తరువాత లోగడ హైకోర్టు దృష్టికితీసికొనిరాని కొన్ని యదార్థ విషయాలు వున్నాయని వాని నాధారంచేసికొని తిరిగి విచారించాలని, ఉభయపక్షాలలో ఏ ఒక్కరైనా హైకోర్టుకు దరఖాస్తు పెట్టుకుంటే హైకోర్టు తిరిగి దాన్ని విచారించవచ్చు. (రూ 42 ఫా V)

(బి) తిరిగి విచారణకుగాను పెట్టుకునే దరఖాస్తు నిర్ణయింపబడే ఆ యాపద్ధతిలో ఆయాకాలంలో పెట్టుకోవాలి; వ్యాపారి దరఖాస్తు పెట్టుకునే పక్షంలో దరఖాస్తుతో పాటు నూరురూపాయలు ఫీజుక్రింద కట్టాలి.

(8) సబ్ శెక్షను (1) లేకసబ్ శెక్షను (7) ననుసరించి పెట్టుకునే ప్రతిదరఖాస్తు సందర్భంలోనూ హైకోర్టు యుక్తవ భావించినట్లు ఖర్చులవిషయంలో ఉత్తర్వు జారీచేయవ

# శెక్షను 23

హైకోర్టుకు అప్పీలు:- (రూ 43 ఫా IV)

(1) 20 వ శెక్షను సబ్ శెక్షను (2) ప్రకార న్యాయ బోర్డు విధించిన పన్నుకు సంబంధించి జారీచేసిన అభ్యంతరాన్ని తెలియబరుస్తూ ఏ వ్యాపారి అ బోర్డు ఉత్తర్వుఅందిన తేదీ మొదలు 60 రోజు ర్టుకు అప్పీలు చేసికొనవచ్చును:

స్వపట్ల రెవిన్యూ లైహైకో

ఏ వ్యాపారిఅయినా పైనుదహరించిన 60 రోజులపిమ్మట అప్పీలు దాఖలుచేస్తే సరైనకారణాలవల్ల అలా అప్పీలు ఆలస్యముగా దాఖలు చేయబడ్డట్టు హైకోర్టు తృప్తిపడితే ఆ అప్పీలును హైకోర్టువారు దాఖలు చేసికొనవచ్చును.

(2) ఆ అప్పీలు నిర్ణయింపబడ్డ నమూనాలో ఉండాలి. నిర్ణీతపద్ధతిలో పరిశీలింపబడాలి. దరఖాస్తుతోసహా నూరు రూపాయలు ఫీజుక్రింద కట్టాలి.

(3) ఉభయపక్షాల వాదనను విన్నపిమ్మట హైకోర్టు యుక్తమనుకున్న విధంగా ఉత్తర్వు జారీచేయాలి.

(4) 22 వ శెక్షను (1) వ సబ్ శెక్షను క్రింద దాఖలు చేయబడే అప్పీళ్ళకు 22 వ శెక్షను (6) (7) (8), సబ్ శెక్షన్ల క్లాజులు వర్తించినట్లే (1)వ సబ్ శెక్షనుక్రింద దాఖలుచేయబడే అప్పీళ్ళకుకూడా వర్తిస్తాయి. (రూ 42-ఫా VI)

## శెక్షను 24

ఇరువురు న్యాయమూర్తులకు తక్కువకాకుండా ఏర్పడే హైకోర్టు బెంచి విచారించవలసిన దరఖాస్తులు, అప్పీళ్ళు, వినతులు:-

22, 23 శెక్షన్ల ననుసరించి హైకోర్టుకు దాఖలుచేయ బడే ప్రతిదరఖాస్తు ప్రతిఅప్పీలు, ఇరువురున్యాయమూర్తులకు తక్కువకాకుండా ఏర్పడే హైకోర్టుబెంచి విచారించాలి; 1908 సం॥లో సివిల్ ప్రొసీజరుకోడ్ (1908 సెంట్రల్ ఆక్టు 5) 98 వ శెక్షను, పై దరఖాస్తులకు, అప్పీళ్ళకు ఈ సందర్భంలో వర్తిస్తుంది.

## శెక్షను 25

వ్యాపారులు మొదలగువారు నిర్వహించవలసిన సరియయిన, నిజమైన లెఖ్కలు, రికార్డులు:-

ఈచట్టప్రకారం లైసెన్సుపొందిన ప్రతివ్యాపారి, రిజిస్టరు చేయించుకోవలసిన ప్రతివ్యాపారి, అధికారులు జారీచేసిన నోటీసుప్రకారం రిజిస్టరు చేయించుకోవాలని కోరబడే ప్రతి వ్యాపారి, రాజ్యాంగచట్టంలోని ఎనిమిదవ షెడ్యూలులో నమోదుచేసిన ఏ భాషలోనైనా, లేక ఇంగ్లీషుభాషలో, వివిధ తరగతుల వ్యాపారులకు, నిర్ణయింపబడే వివిధ వివరాలతో సరైన, నిజమైన లెఖ్కలను నిర్వహిస్తూఉండాలి.

## శెక్షను 26

యజమానులు మొదలగువారు పడవలకు (బోట్లకు) సంబంధించిన కొన్ని రికార్డులు దాఖలు చేసికొనవలసిన విధానం:- 1890 మద్రాసు కెనాల్సు అండ్ పబ్లిక్ ఫెర్రీస్ ఆక్టు 1890 మద్రాసు చట్టం) లేక 1314 ఫసలీహైదరాబాదు ఫెర్రీస్ ఆక్టు (1314 ఫసలీహైదరాబాదు చట్టం) ప్రకారం రిజిస్టరయిన ప్రతి బోటుయజమాని లేక బోటుపై యాజమాన్యంవహించే ఇతరవ్యక్తి, ఆయాప్రాంతపు కమర్షియల్ టాక్సు ఆఫీసరుకు ఈ చట్టాన్ననుసరించి నిర్ణయింపబడే కాలంలోపల "లాగ్ బుక్" కాపీ ఏమైనాఉంటే ఇతరవివరాలతోసహా దాఖలు చేసికొన వలెను.

వివరణ:—

"లాగ్ బుక్" అంటే సరుకుల రవాణా వివరాలు తెలిపే రిజిష్టరులు స్టేటుమెంటులు లేక ఇతర రికార్డులని అర్థం.

## శెక్షను 27

యజమానులు మొదలగువారు సరుకుల రవాణాబండ్లకు సంబంధించిన కొన్ని రికార్డులు దాఖలు చేసికొనవలసిన విధానము: —

1939 మోటారు వెహికిల్సు ఆక్టు (1939 సెంట్రల్ ఆక్టు 4) ప్రకారం రిజిష్టరయిన సరుకుబండి యజమాని లేక ఆ బండికి యాజమాన్యం వహించే ఇతరవ్యక్తి ఆయాప్రాంతపు కమర్షియల్ టాక్సు ఆఫీసరుకూ ఈ చట్టాన్ననుసరించి నిర్ణయింపబడే కాలంలోపల సరుకు బండి రిజిస్ట్రు, లేక ట్రిప్పుషీటు కాపీలను దాఖలు చేసికొనవలెను.

## శెక్షను 28

లెఖ్ఖలపుస్తకాలు తెప్పించుకునేందుకు, ప్రవేశించి పరీక్షించేందుకు మొదలగు అధికారములు:-

(1) రాష్ట్రప్రభుత్వంచే నియమింపబడిన అధికారి, ఈ చట్టప్రకారం ఏ వ్యాపారినైనా తన వ్యాపారానికి సంబంధించిన లెఖ్ఖలను రిజిష్టర్లను తదితరపత్రాలను, అవసరమనుకున్న తదితర వ్యాపారమునకు సంబంధించిన సమాచారాన్ని దాఖలు చేయమని కోరవచ్చును.

(2) తన వ్యాపారాన్ని నడుపుటకు ఏర్పడిన అన్ని లెఖ్ఖలు, రిజిష్టర్లు పత్రాలు, తనస్వాధీనంలో నున్న సరుకులు అతని ఆఫీసులు, షాపులు, సరుకు నిలవచేసేకొట్లు, పడవలు లేక బండ్లు సదరు అధికారికి సబబైన అన్నికాలాల్లో పరీక్షచేసేందుకు బహిరంగంగా ఉంచాలి.

(3) ఈచట్టప్రకారం యివ్వవలసిన పన్నుగాని లేక ఇతర బకాయిగాని ఏవ్యాపారి అయినా తప్పించుకోటానికి ప్రయత్నిస్తున్నాడని, సదరు అధికారి కారణమున్నదని అనుమానిస్తే కారణాలను వ్రాతమూలకంగా వివరిస్తూ వ్యాపారి యొక్క ఆయా లెఖ్ఖలను రిజిస్టర్లను లేక అవసరమైన పత్రాలను స్వాధీన పరచుకోవచ్చు. అలా స్వాధీనపరచుకున్న వాటికి సదరు అధికారి వ్యాపారికి రశీదు యివ్వాలి. అలా స్వాధీన పరుచుకున్న రిజిస్టర్లు మొదలగువాటిని ఈచట్టప్రకారం పరీక్షించేందుకు, విచారించేందుకు లేక చర్యతీసుకునేందుకు ఎంత కాలం పడుతుందో అంతకాలం మాత్రమే సదరు అధికారి తన స్వాధీనంలో ఉంచుకోవాలి.

రిజిస్టర్లు వగైరా స్వాధీనపరుచుకున్న అధికారి, వారిపై అధికారి అనుమతి పొందితేనేగాని, స్వాధీనపరుచుకున్న రిజిస్టర్లు మొదలగువానిని సదరు అధికారి 30 రోజులకు మించి వానిని తన స్వాధీనంలో ఉంచుకోకూడదు.

(4) సబ్ శెక్షను (2) సబ్ శెక్షను (3) ప్రకారం నియమింపబడ్డ ఏఅధికారిఅయినా సబబైన అన్నికాలాల్లో, వ్యాపారి యొక్క ఆఫీసు, షాపు సరుకు నిలవచేసేకొట్టు, పడవ లేక బండి లేక ఏయితర వ్యాపారస్థలమైనా, లేక ఏభవనమైనా లేక వ్యాపారానికి సంబంధించిన ఏ లెఖ్ఖలైనా, రిజిస్టర్లు లేక ఇతరపత్రాలైనా, అక్కడ వ్యాపారి ఉంచుతున్నాడని అభిప్రాయపడటానికి అధికారికి కారణాలు కనిపిస్తే ఆ స్థలంలో ప్రవేశించి పరిశోధన చేయటానికి అధికారం ఉంది.

అయితే నివాసస్థలంలో (నివాసం దుకాణం రెండూ కలిసి ఉండనిచో) సదరు అధికారి ప్రవేశించి పరిశోధనలు

జరపటానికి వీలులేదు, కాని 1898 (1898 సెంట్రల్ ఆక్టు 5) క్రిమినల్ ప్రొసీజరుకోడ్ ప్రకారం ఆయాప్రాంతపు మేజిస్ట్రేటు జారిచేసిన సెర్చివారంటు ననుసరించి యిందు విషయమై చేయబడిన నియమావళికిలోబడి నివాసస్థలంలో కూడా ప్రవేశించి పరిశోధనలు జరుపవచ్చును.

(5) సబ్ శెక్షను (4) ననుసరించి సంక్రమించే అధికారాన్ని పురస్కరించుకొని సదరు అధికారి, వ్యాపారియొక్క లెఖ్ఖలు, రిజిష్టర్లు లేక తదితర పత్రాలు ఉంటే పెట్టెను లేక బీరువాను పగలకొట్టవచ్చు; లేక పై నుదహరించిన రిజిష్టర్లు మొదలయినవి ఉండే ఆవరణ ఇంటితలుపులను బద్దలు కొట్టవచ్చును.

అయితే ఈ ఆవరణలో ఉన్న యజమాని లేక తదితర వ్యక్తిదాంట్లోవుండి తలుపు తెరవటానికి నిరాకరించిన పిమ్మటే సదరు అధికారి తలుపులు బద్దలుకొట్టు అధికారమును ఉపయోగించవలయును.

(6) ఒకవ్యాపారి తన వ్యాపారసంబంధమైన లెఖ్ఖలలో, రిజిస్టర్లలో, ఇతరపత్రాలలో, చూపని సరుకులు అతని ఏ ఆఫీసులోనైనా, షాపు, సరుకు నిలవచేసేకొట్టు, బండి, ఓడవ లేక వ్యాపారంచేసే ఏ ఇతరస్థలంలోనైనా లేక వ్యాపారి తాలూకు ఏ భవనం లేక స్థలంలోనైనా కనిపిస్తే సదరు అధికారి వానిని స్వాధీనపరుచుకుని ప్రభుత్వానికి సంక్రమింప చేయవచ్చును.

అయితే ఈ సబ్ శెక్షను ప్రకారము సరుకులను ప్రభుత్వానికి సంక్రమింపజేసేముందు నిర్ణయింపబడ్డ పద్ధతిలో నష్టము పొందిన వ్యక్తికి చెప్పుకోవలసింది వుంటే చెప్పుకునేందుకు

అవకాశం కలుగజేయాలి, నిర్ణయింపబడిన ప్రకారం భోగట్టా చేయాలి.

వివరణ:— (1), (2), (3) సబ్ శెక్షన్ల క్రింద రాష్ట్ర ప్రభుత్వం వివిధతరగతుల అధికార్లకు పై అధికారాన్ని అమలు జరుపుటకు ఉత్తర్వులు యివ్వవచ్చును.

## శెక్షను 29

రవాణా సరుకుల తనిఖీ ఆఫీసులు, అడ్డంకులు ప్రయాణం చేయుచున్న సరుకుల పరిశీలన:-

(1) ఈ చట్టాన్ననుసరించి పన్ను తప్పించుకోటానికి జరిపే చర్యలను అరికట్టటానికి రాష్ట్రప్రభుత్వం అవసరమనుకున్నప్పుడు రాష్ట్రంలో ఏ ప్రదేశమందైనా లేక కొన్ని ప్రదేశాల్లో ప్రకటన పూర్వకంగా తనిఖీ ఆఫీసులను అడ్డంకులను నెలకొల్పవచ్చును.

(2) 1 వ సబ్ శెక్షను ప్రకారం నెలకొల్పబడే ఆఫీసుల అడ్డంకులవద్ద, లేక రాష్ట్రప్రభుత్వంచే దీనికొరకు నియమింపబడ్డ ఏ అధికారి అయినా ఒక ప్రదేశంలో ఎక్కడైనా అడిగినప్పుడు, సరుకు పడవ, లేక బండిడ్రైవరు, లేక సరుకునుచూచే తదితరవ్యక్తి, ఆయాఅధికారికి పడవ లేక బండిలోని సరుకులను తనిఖీచేసికొనుటకు, లేక రవాణాసరుకుకు సంబంధించిన రికార్డ్లు పరీక్షించుటకు సబబుగా ఎంతకాలంపడుతుందో అంత కాలం పడవలేక బండిని నిలబెట్టి తనిఖీ చేసికోనివ్వాలి. అలా కోరబడ్డప్పుడు డ్రైవరుపేరు, చిరునామా, పడవ లేక బండి యజమానిపేరు, చిరునామా తెలియబరచాలి.

(3) డెలివరీనోటు, సరుకుబండి రికార్డు, ట్రిప్పుషీటు లేక లాగ్‌బుక్కు, లేక ఉండవలసిన అమ్మకపుబిల్లు వానిలో ఉదహరించకుండా వున్న సరుకులు ఏమైన పడవలో లేక బండిలో ఉంటే అట్టి సరుకును ఆయాప్రదేశాల్లో నెలకొల్పబడే అధికార్లు లేక దీనికొరకు రాష్ట్రప్రభుత్వం నియమించే అధికారి. స్వాధీనపరుచుకుని ఆ సరుకును ప్రభుత్వానికి సంక్రమింప జేయవచ్చును.

అయితే ఈ సబ్ శెక్షన్ ప్రకారం సరుకులను ప్రభుత్వానికి సంక్రమింపజేసేముందు నిర్ణయింపబడ్డ పద్ధతిలో వ్యాపారి చెప్పుకునేది వినేందుకు పూర్తి అవకాశం కలుగజేయాలి.

## శెక్షను 30

నేరములు-అపరాధములు:-

(1) ఏ వ్యాపారిఅయినా—

1. (ఏ) ఈచట్టప్రకారం తనపై విధింపబడ్డపన్నును లేక అపరాధమును లేక అతనివల్ల రావలసినరుసుము నిర్ణీతకాలంలో చెల్లించక పోయినచో లేక

(బి) ఈచట్టప్రకారం రిజిస్టరుచేయించుకోవలసిన అవుసరం ఉండి అలా రిజిస్టరు చేయించుకోకపోయినా లేక

(2) ఈ చట్టంలోని శెక్షనను లేక నిబంధనలను బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించినా, అపరాధియని విచారణలో తేలివప్పుడు, రెండువేలరూపాయలవరకూ అపరాధం విధించబడవచ్చును.

(2) ఏవ్యక్తిఅయినా-

2. (ఎ) 28వ శెక్షనుప్రకారం నియమించబడ్డ అధికారిని తనిఖీచేయటానికి, ప్రవేశించటానికి, పరిశోధించటానికి లేక స్వాధీనం చేసుకోటానికి అటకాయించి లేక అవరోధం కలుగజేసి ఆయా పరతులను ధిక్కరిస్తే; లేక

2. (బి) 29వ శెక్షనుప్రకారం ఆయా ప్రదేశాల్లో నియమింపబడే ఉద్యోగులను లేక దీనికిగాను నియమింపబడే అధికారిని పడవ లేక బండిలో సరుకులను తనిఖీచేయటానికి అటకాయిస్తే లేక అవరోధం కలుగజేస్తే అపరాధియని విచారణలో తేలినప్పుడు 6 నెలలవరకూ విడిఖయిదూ, లేక రెండు వేలరూపాయలవరకూ అపరాధము లేక రెండూ విధించవచ్చు.

(3) ఏవ్యక్తిఅయినా-

3 (ఎ) ఈచట్టానుగుణ్యంగా, లేక నిర్ణయింపబడే నిబంధనల ప్రకారం బుద్ధిపూర్వకంగా తప్పుడు రిటరన్‌లు దాఖలు చేసినా లేక రిటరన్‌లు పంపకపోయినా; లేక

(బి) ఈ చట్టప్రకారం తాను చెల్లించవలసిన పన్ను, ఫీజు లేక తదితర బాకీ మోసంతో తప్పించుకున్నా, అపరాధియని విచారణలో తేలినప్పుడు, మొట్టమొదటిపర్యాయం రెండువేల రూపాయలవరకూ అపరాధము, రెండవ పర్యాయం తరువాత 6 నెలల వరకూ విడిఖయిదు లేక రెండువేల రూపాయలవరకు అపరాధము, లేక రెండూ విధించవచును.

## శెక్షను 31

(1) అపరాధనిర్ణయం:- ఈ చట్టప్రకారం ఒక అపరాధాన్ని నిర్ణయించుటకాని విచారించుటకాని ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు కోర్టుమాత్రం జరిగించవలయును.

(2) 30వ శెక్షను 2వ సబ్ శెక్షనుక్రింద లేక 3వ సబ్ శెక్షను క్రింద రెండవపర్యాయం, లేక తరువాతజరిగినఅపరాధా లనుగూర్చి కోర్టులో చర్యతీసికొనేందుకు పూర్వం ఆయా ప్రాంతపు కమర్షియల్ టాక్సు ఆఫీసరువద్ద వ్రాతపూర్వక ఒప్పు దల ఆయా అధికారులు పొందాలి.

## శెక్షను 32

అపరాధాల సర్దుబాటు:— ఈ చట్టప్రకారం అపరాధం చేసిన లేక అపరాధియని సబబుగా అనుమానింపబడ్డ ఏవ్యక్తి వద్దనుంచి అయినా అపరాధం సర్దుబాటు చేయటానికి ఇందుకు గాను నియమింపబడ్డ అధికారి ఈ క్రింద సూచించిన మొత్తా లను స్వీకరించవచ్చును:—

(ఎ) ఈ చట్టప్రకారం చెల్లించవలసినపన్ను చెల్లించక పోయినా లేక తప్పించుకోటానికి యత్నించినా వీనికి సంబం ధించిన అపరాధానికి చెల్లించవలసిన పన్ను, పైన వెయ్యి రూపాయలకు మించని మొత్తం లేక చెల్లించవలసిన మొత్తా నికి రెట్టింపు, ఈ రెండు మొత్తాలలో ఏది హెచ్చైతే ఆ మొత్తం.

(బి) ఇతర అపరాధాలకు వెయ్యిరూపాయలకు మించని మొత్తం.

## శెక్షను 33

వాపసులు:—ఉజ్జాయింపుగా ఏవ్యాపారి అయినా పన్ను గాని లేక లైసెన్సుఫీజుగాని ఒకప్రత్యేక కాలానికి కట్టింది ఆకాలా నికి తాను నికరంగా చెల్లించవలసినదానికంటె మించిఉంటే అలా మించి చెల్లించిన పన్ను లేక లైసెన్సు ఫీజును, పన్ను

నిర్ణయించే అధికారి లేక లైసెన్సు జారీచేసే అధికారి ఆ వ్యాపారికి తిరిగి ఇచ్చివేయాలి. లేక ఆ వ్యాపారి అనుమతితో ఆ మొత్తాన్ని మరోకాలానికి బాకీ ఉన్న పన్ను లేక లైసెన్సు ఫీజు క్రింద సర్దుబాటు చేసికొనవచ్చును.

అయితే, ఏదైనా ఒక మొత్తం చెల్లించాలని ఆవ్యాపారికి డిమాండునోటీసు యిచ్చిఉంటే, అధికంగా చెల్లింపబడ్డ మొత్తంనుండి డిమాండునోటీసుమొత్తంమేరకు మినహాయించి మిగతా మొత్తాన్నే పన్ను విధించే అధికారి లేక లైసెన్సు జారీచేసే అధికారి వ్యాపారికి వాపసుచేయాలి.

( రూ 15, 17, & 30–ఫా C )

## శెక్షను 34

రికార్డు తెప్పించుకోటానికి, సాక్షులను రప్పించుకోటానికి అధికారం:— పన్ను విధించే అధికారికి లేక అప్పిలెట్ లేక రివిజన్ అధికార్లకు ఈ చట్టాన్ననుసరించి ఈ క్రింది అధికారం ఉంటుంది—— (రూ56–ఫా IX )

(ఎ) ఒకవ్యక్తి హాజరయి సాక్ష్యం యివ్వాలని, నోటీసు జారీచేయటానికి, ఆ వ్యక్తిని ప్రమాణం చేయించి పరీక్షించటానికి;

(బి) ఏ పత్రాన్ని అయినా దాఖలుచేయమని కోరటానికి అధికారం వుంటుంది.

## శెక్షను 35

అధికారి ఎదుట జరుగు చర్యలతో పాల్గొను ప్రతినిధి: ఈ చట్టాన్ననుసరించి జరిపేవ్యవహారంలో ఒక్క హైకోర్టులో

తప్పతదితర అధికారివద్ద హాజరవటానికి అర్హతయున్న ఏవ్యక్తి అయినా తన తరఫున హాజరవటానికి ఈ క్రింద నుదహరించి నట్లు నియమించవచ్చును—

(ఎ) తనతరఫున హాజరవ వచ్చునని వ్రాతమూలకంగా తెలుపుతూ అతని చుట్టం లేక అతనివద్ద క్రమంగా పనిచేసే ఉద్యోగి; లేక.

(బి) న్యాయవాది; లేక

(సి) నిర్ణయింపబడే ఆయాపరతుల ననుసరించి ఒక ఎకౌంటెంటు లేక సేల్సుటాక్సు ప్రాక్టీషనరు; తనతరఫున హాజరవవచ్చని వ్రాతమూలక నియామకం ఉండాలి; అలా హాజరయ్యేవారికి నిర్ణయింపబడే ఆయా యోగ్యతలుండాలి.
(రూ 54-ఫా XII)

## శెక్షను 36

కోర్టు అధికారంలో పరిమితులు:— ఈ చట్టంలో స్పష్టంగా తెలియబరచినట్లుగాక మరోవిధంగా ఈ చట్టాన్ననుసరించి లేక ఈ చట్ట నిబంధనావళి ననుసరించి ఒక అధికారి లేక అధికారవర్గం నిర్ణయించిన పన్ను, జారీచేసిన ఉత్తర్వు లేక తదితర నిర్ణయంలోని న్యాయాన్ని ప్రశ్నించే, మార్పుచేసే లేక రద్దుచేసే చర్యలు తీసుకోటానికి ఏ కోర్టుకూ అధికారం లేదు.

## శెక్షను 37

సద్భావంతో జరిపిన చర్యలకు రక్షణ:—

(1) రాష్ట్రప్రభుత్వామోదం, ముందుగా పొందనిదే ఈ చట్టానుసారం లేక ఈ చట్టానుగుణ్యంగా జరిగిందని ఎంచ

బడే ఎట్టిచేతలకు రాష్ట్రప్రభుత్వపు ఏ అధికారి లేక నౌకరు పైనా ఎట్టిదావా, ఎట్టిక్రమచర్యా లేక తదితర ఎట్టి చర్యా తీసికు నేందుకు వీలులేదు; ఫిర్యాదుచేసే చేత జరిగిన తేదీ మొదలు ఆరు నెలలపిమ్మట ఎట్టిదావా, ఎట్టి క్రమచర్యా లేక ఎట్టి ఇతరచర్యా తీసికు నేందుకు వీలులేదు.

(2) ఈ చట్ట ప్రకారం నిర్వహించవలసిన విధులలో, జరుపవలసిన కార్యకలాపాలలో రాష్ట్రప్రభుత్వఉద్యోగి లేక నౌకరు సద్భావంతో చేసిన ఎట్టి చేతలపైన ఎట్టి సివిల్ లేక క్రిమినల్ చర్య తీసికు నేందుకు వీలులేదు.

## శెక్షను 38

ఎగుమతి లేక దిగుమతి మొదలగు సందర్భాలలో రాష్ట్రం వెలుపల జరిగిన అమ్మకాలు లేక కొనుగోళ్ళకు పై చట్టం వర్తించదు.

ఈ చట్టంలో ఉదహారించినవి, ఈ క్రింద నుదహారించిన ఏ సరుకుల అమ్మకం లేక కొనుగోలు పై పన్ను విధించటానికి ఉద్దేశింపబడ లేదు—

(i) రాష్ట్రం వెలుపల; లేక

(ii) భారతదేశ భూభాగంనుంచి ఎగుమతిఅయ్యే సరుకులకు, భారతదేశ భూభాగంలో దిగుమతి అయ్యేసరులకు లేక

(iii) అంతర్రాష్ట్ర వాణిజ్యలేక వ్యాపారసందర్భాలలో

వివరణ:—అంతర్రాష్ట్రవాణిజ్యవ్యాపారంలో, భారతదేశ ఎగుమతి దిగుమతి సందర్భాలలో సరుకుల అమ్మకం లేక కొనుగోలు (1956 వ సం॥ రం సెంట్రల్ సేల్సుటాక్సు ఆక్టు 11వ

చాప్టరు 1956 సెంట్రల్ ఆక్టు 74)లో క్లాజుల . ననుసరించి నిర్ణయింపబడుతుంది.

## శెక్షను 39

నిబంధనలు చేసే అధికారం:—

(1) ఈ చట్టాన్ని అమలులో పెట్టటానికి కావలసిన నిబంధనలను రాష్ట్రప్రభుత్వం నిర్మించవచ్చును.

(2) ప్రత్యేకంగా పై నుదహరించిన అధికారానికి ఎట్టి భంగం కలుగకుండా ఈ క్రింద సూచించినవాటికి ఆయా నిబంధనలను రూపొందించవచ్చును.

(ఎ) ఈ చట్టాన్ననుసరించి స్పష్టపరచవలసిన విషయాలన్నిటినీ నిర్ణయించటానికి;

(బి) అప్పిలెట్ ట్రిబ్యూనల్ కోర్టు నిర్ణీతకాలము ఉద్యోగ షరతులు, సభ్యులు,

(సి) ఈ చట్టపుక్లాజుల ననుసరించి సరుకుల అమ్మకం కొనుగోలు వ్యాపారంలోనున్న వ్యక్తులకు లైసెన్సులు, పర్మిట్లు జారీచేయటం, అందుకుగాను వ్యక్తులు చెల్లించవలసిన ఫీజులు, పాటించవలసిన విధులు నిర్ణయించటం;

(డి) విధింవబడ్డపన్ను అప్పీలు లేక రివిజన్‌లో కనుపించే తప్పులు సవరించటం; తప్పుదిద్దుకోవలసిన కాలనిర్ణయం;

(ఇ) ఆయా ప్రదేశాల్లో నెలకొల్పబడే తనిఖీ ఆఫీసులు అడ్డంకులు నిర్వహణ; అచ్చటి కార్యకలాపాలను క్రమబద్ధం చేయటం;

(యఫ్) ఈ చట్టప్రకారం ప్రభుత్వానికి సంక్రమించిన సరుకుల విడుదల అమ్మకపుసొమ్ము.

(జి) బిల్లులు లేక నగదు మెమోరాండా వీని నక ళ్ళను ఉంచవలసిన వ్యాపార్లతరగతి లేక తరగతులు, ఈ నకళ్ళ నిర్వహణ, చూపవలసిన వివరాలు, వీనిని జాగ్రత్తపరచ వలసినకాలం;

(హెచ్) ప్రత్యేకవస్తువులతో వ్యాపారం చేసేవ్యాపార్లు జరిపే అమ్మకాలు. కొనుగోళ్ళకు ఉంచవలసిన బిల్లులు లేక లెఖ్కలు వానిని జాగ్రతగా ఉంచవలసినకాలం;

(ఐ) చిల్లరవ్యాపారులకు విడుదలచేసిన రేకరవాణాచేసిన సరుకులకు యివ్వవలసిన విడుదలచీట్లు వాని నమూనా, వానిని జారీచేయవలసిన పద్ధతి నకళ్ళు జాగ్రతపరచవలసిన కాలం (రూ 45-4 ఫా X)

(జె) ఈ చట్టప్రకారం దాఖలు చేయబడ్డ దరఖాస్తులు అప్పీళు. తీసుకున్న తదితర చర్యలకు 1908 సం॥రపు సివిల్ ప్రొసీజరుకోడ్ (1908 సెంట్రల్ ఆక్టు 5) క్లాజులను ఆయా మేరల వర్తింపచేయుటం;

(కె) ఈ చట్టప్రకారం పన్ను నిర్ణయించే అధికారికి లేక అప్పీలు లేక అప్పీలు నిర్ణయంపై రివిజను సందర్భంలో దాఖలుచేయబడ్డ రిటరన్‌లు లేక లెఖ్కలు లేక పత్రాలు లేక యిచ్చిన సాక్ష్యం రహస్యంగా వుంచి భద్రపరచటం.

(యల్) ఈ చట్టంలో శెక్షన్లను అమలుపరచటానికి నియమింపబడే అధికార్ల విధులు అధికారాలు

(యమ్) 21వ శెక్షను ప్రకారం చెల్లించే ఫీజు ఏ పరిస్థితిలో ఎంతవరకు వాపసు చెయ్యాలి;

(యన్) ఈ చట్టప్రకారం తీసికునే చర్యల విధానం పద్ధతి సాధారణంగా క్రమబద్ధం చేయటం;

(ఓ) ఒకవ్యాపారం ఆగిపోయినా, లేక యాజమాన్యం మారినా లేక వ్యాపారి చనిపోయినా ఈ చట్టప్రకారం రావలసిన పన్ను రాబట్టటం;

(పి) మైనర్లు జరిపే వ్యాపారం, లేక అశక్తుడు లేక ఇతరరాష్ట్రంలో నివసించే వ్యక్తులు జరిపే వ్యాపారంపై ఈ చట్టప్రకారం రావలసినపన్ను రాబట్టటం;

(క్యు) ఒకవ్యక్తి ఎస్టేటు లేక ఎస్టేటులో భాగం కోర్టు ఆఫ్ వార్డులు లేక అడ్మినిస్ట్రేటర్ జనరల్ లేక అఫీషియల్ ట్రస్టీ లేక కోర్టు నియమించిన రిసీవరు లేక మేనేజరు స్వాధీనంలోవుంటే ఈ చట్టంప్రకారం రావలసినపన్ను రాబట్టటం;

(ఆర్) 2 వ శెక్షను 1వ సబ్ శెక్షన్ 4వ క్లాజుప్రకారం ఒకవ్యాపారి ఇష్టానుసారం మధ్యకాలానికి చెల్లించవలసిన పన్ను నిర్ణయం.

(3) 1 వ సబ్ శెక్షన్ లేక 2 వ సబ్ శెక్షన్ ప్రకారం రాష్ట్రప్రభుత్వం ఏర్పాటుచేసే నిబంధనలలో, ఏ నిబంధన ఉల్లంఘించినా ఆవ్యక్తి ఫస్టుక్లాసు మేజిస్ట్రేటుచే విచారింపబడి నేరస్థుడని నిర్ధారింపబడినచో ఆ వ్యక్తి రెండువేలరూపాయల

వరకూ అపరాధము విధింపబడవచ్చుననే నిబంధననుకూడా రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేయవచ్చును.

(4) ఈ శెక్షన్ ప్రకారం రూపొందింపబడే అన్ని నిబంధనలు ఆంధ్రప్రదేశ్ గెజిట్‌లో ప్రకటింపబడతాయి. అటు పిమ్మట అవి ఈ చట్టంలో క్లాజులవలెనే అమల్లోకి వస్తాయి. ఇలా ప్రకటింపబడిన నిబంధనలు సాధ్యమైనంత తొందరగా శాసనసభ బల్లమీద 14 రోజులపాటు వుంటాయి; శాసనసభ ఆ సమావేశంలో ఈ నిబంధనలను మార్చవచ్చు, సవరించవచ్చు లేక రద్దుచేయవచ్చు.

## శెక్షను 40

షెడ్యూళ్ళను సవరించే అధికారం:-

(1) ఈ చట్టంలోని షెడ్యూళ్ళను రాష్ట్రప్రభుత్వం ప్రకటన పూర్వకంగా ఏ షెడ్యూలైనా మార్చవచ్చు. కలపవచ్చు లేక రద్దుచేయవచ్చును.

అయితే ఆయా ప్రకటన ముసాయిదాను శాసనసభ ముందుగా ఆమోదిస్తేనేగాని ప్రకటించటానికి వీలులేదు.

(2) 1 వ సబ్ శెక్షను ప్రకారం, ఈ చట్టంలో పేర్కొన్న షెడ్యూళ్ళన్నీ ప్రస్తుతానికి సవరింపబడినట్లే ఎంచుకోవాలి.

## శెక్షను 41

రద్దు:— 1939 మద్రాసు జనరల్ సేల్సు ఆక్టు (1939 మద్రాసు ఆక్టు 9), 1950 హైదరాబాద్ జనరల్ సేల్సు

టాక్సుఆక్టు, (1950 హైదరాబాద్ ఆక్టు 14). 1953 మద్రాసు టుబాకో (అమ్మకం, రిజిస్ట్రేషన్ పన్ను) ఆక్టు (1953 మద్రాసు ఆక్టు 4) 1956 ఆంధ్రా జనరల్ పర్చేస్ టాక్సు ఆక్టు (1956 ఆంధ్రాఆక్టు 13) 1937 మద్రాసు ప్రొహిబిషన్ ఆక్టు 21—ఎ శెక్షను (మద్రాసు 1937 ఆక్టు 10) ఇందుమూలంగా రద్దు చేయబడ్డాయి.

అయితే సదరు రద్దుఅయిన చట్టాలు లేక శెక్షను లేక హక్కులు, స్వామ్యం, ననుసరించి ఇప్పటివరకూ జరిపిన చర్యలు; అంటే నియామకం, ప్రకటన, నోటీసు, ఉత్తర్వు, నిబంధన, విధానం, క్రమబద్ధంచేయటం, సర్టిఫికేటు లైసెన్సు లేక పర్మిట్ మొదలగువానితో సహా, ఈ రద్దు పైవాటిని అంతరాయం కలిగించదు; సదరు రద్దుఅయిన చట్టాలు లేక శెక్షన్లుప్రకారం చలాయింపబడ్డ అధికారం ఈ చట్టప్రకారం లేక ఈ చట్టాన్ననుసరించి చలాయింపబడే అధికారంగానే పరిగణింపబడుతుంది; ఈ చట్టం అమల్లోకి వచ్చినకాలానికి బాకీ ఉన్న పన్ను లేక తదితర మొత్తాలు ఈ చట్టంక్రింద బాకీలుగానే ఎంచబడి వసూలు చేయబడతాయి.

(2) 1 వ శెక్షనులో ఏమి ఉన్నప్పటికీ ఈ చట్టం అమల్లోకివచ్చినప్పటికి సదరురద్దుఅయిన చట్టాలు లేక శెక్షనులక్రింద దాఖలు చేయబడి, విచారింపబడకుండా ఉన్న దరఖాస్తు, అప్పీలు లేక రివిజను లేక తదితర వ్యవహారాలు ఈ చట్ట ప్రకారం, విచారణ జరపవలసిన ఆయా అధికారి లేక అధికార

వర్గానికి బదలాయింపబడతాయి; అట్టి దరఖాస్తు, అప్పీలు, రివిజన్ లేక తదితర వ్యవహారం జరిపిన ఆయా తేదీల నాటికి ఈ చట్టం అమల్లోకి వచ్చినట్లే ఎంచబడుతుంది.

## సెక్షను 42

చిక్కులను తొలిగించే అధికారం:—

(1) ఈ చట్టం అమల్లోకి రాకముందు అమల్లో ఉన్న చట్టాలు, శాసనలకుగాను చేసిన ఏర్పాట్లకు ఈ చట్టప్రకారం చేసే ఏర్పాట్లకు సమన్వయం కుదరక చిక్కులు పొడకట్టేసందర్భంలో ఆ చిక్కులను తొలిగించే అవసరమైన ఏర్పాట్లను, ఆంధ్రప్రదేశ్ గెజిట్‌లో ప్రకటించి, రాష్ట్రప్రభుత్వంచేయవచ్చు.

(2) పై నుదహరించిన చిక్కులుగాక తదితర చిక్కులు ఏవైనా సంభవిస్తే ఈ చట్టానుగుణ్యంగా ఆ చిక్కులను తొలిగించే ఏర్పాటు రాష్ట్రప్రభుత్వం, ప్రకటనద్వారా చేయవచ్చు.

స మా ప్త ము

— :o: —

## షెడ్యూలు. 1

యీ క్రింద తెలిపిన 17 రకముల సరుకులకు 5 శెక్షను 2 వ సబ్ శెక్షను ప్రకారము రాష్ట్రములో మొట్టమొదటిసారిగా అమ్మినప్పుడు ఆయా రేట్ల చొప్పున ఆయా సరుకులకు, షెడ్యూలులో తెలిపిన ప్రకారం, పన్నును చెల్లించాలి. ఈ విధంగా సింగిల్ పాయింటులో (మొదట అమ్మకంలో) చెల్లించినపన్నే గాకుండా యీ సరుకులలో వ్యాపారం చేసేవారందరూ, 5 శెక్షను 1 సబ్ శెక్షను ప్రకారము జనరల్ సేల్సుటాక్సు అంటే రూపాయకు 2 నయాపైసలు చొప్పున చెల్లించాలి.

1. రిఫ్రీజరేటర్లు, ఎయిర్ కండిషన్ డ్ ప్లాంట్సు. పైయంత్రాలతాలూకు విడిభాగాలకు 2. వైర్ లెస్ యంత్రాలు, వానితాలూకు విడిసామానులు అంటే వాల్వులు, ఎక్స్యూములేటర్సు యాంప్లిపైయర్లు, లౌడ్ స్పీకర్లు, వీని తాలూకు సామానులు. 3. రేడియో గ్రామఫోనులు వీనితాలూకు విడిసామాలు. 4. సినిమెటోగ్రాఫ్, కెమేరాలు, ప్రొజెక్టర్లు, ఎన్లార్జర్లు, లెన్సులు వీటి తాలూకు విడిసామానులు, ఫిల్ములు, ప్లేట్లు, పేపరు, క్లాత్, వీటితాలూకు విడిసామానులు. 5. బైనాక్యులర్లు, ఒపెరాగ్లాసెస్. 6 గ్రామఫోనులు, ప్లేట్లు. 7. ఆఫ్ హోల్ స్టర్డు ఫర్నీచరు. 8. దంతపువస్తువులు, లేదా దంతపు పనిగలిగిన సరుకులు. 9. తుపాకులు, రివాల్వరు, పిస్టల్సు. వీనితాలూకు తుపాకిగుళ్లు. 10. సిగరేట్ కేసెస్, లైటర్సు. 11. రబ్బరు దిండ్లు పరుపులు, పరుపులు మొదలగునవి 12. చీట్లపేకలు, 13. చలవరాళ్ళు వీనితో తయారయిన వస్తువులు.

పైన తెలిపిన 1 నుండి 13 వరకు గల సరుకులకు, మొట్టమొదటి సారిగా, అమ్మినప్పుడు రూపాయకు, అయిదు నయాపైసలు చొప్పున ప్రత్యేకముగా పన్ను చెల్లించాలి.

14. అన్నిరకాల ఎలెక్ట్రిక్ సామానులు, యిన్స్ట్రుమెంట్సు, యాపరేటస్, పంకాలు, బల్బులు, ఎలెక్ట్రిక్ తాలూకు పింగాణీవస్తువులు, తదితర వస్తువులు, 15. యిరవైరూపాయలధరకు మించిన పౌన్ టెన్ పెన్సు, పెన్సిలు, లేదా, పెన్సు, పెన్సిలుసెట్లు, 16. అన్నిరకాల గడియారములు వీనితాలూకు విడిసామానులు, 17. వజ్రాలు, రత్నాలు, కెంపులు, మొదలగురాళ్ళు విడిగాగాని, ఒక వస్తువులో బిగించినవిగాని.

14 నుంచి, 17 వరకూగల సరుకులు మొట్టమొదటిసారిగా అమ్మినప్పుడు రూపాయకు మూడు నయాపైసలు చొప్పున ప్రత్యేకముగా పన్ను చెల్లించాలి. అంటే, ఈ సరుకులు హోల్ సెల్లరు యితర రాష్ట్రాలనుంచి

తెప్పిస్తే, అతగాడు, రిటెయిల్ డీలరు తెప్పిస్తే అతగాడు చెల్లించాలి. రిటైలు డీలరు రాష్ట్రములోని హోలుసేలు డీలరువద్దకొని, తిరిగి యీరాష్ట్రములో అమ్మితే, అతడు సాధారణమైన పన్నుమాత్రమే చెల్లించవలసి వుంటుంది.

## షెడ్యూలు 2.

ఈ క్రింద తెలిపిన 32 సరుకులను, శెక్షను 5, సబ్ శెక్షను 3 (ఎ) ప్రకారము రాష్ట్రములో, మొట్టమొదటిసారిగా అమ్మినప్పుడు, ఆయా సరుకులకు, ఆయా రేట్లచొప్పున సింగిల్ పాయింటు టాక్సు చెల్లించాలి. (అనగా జనరల్ టాక్సు కట్ట నవసరంలేదు)

1. ప్రత్తినూలు వస్త్రములు (చేతి మగ్గములమీద తయారయినవిగాక) ఫైన్, సూపర్ ఫైన్ తరగతివి రూపాయికి తొమ్మిది నయాపైసలు చొప్పున (2) వస్త్రములు. (చేతి మగ్గములమీద తయారయినవిగాక) సిల్కు, ఆర్టిఫిషియల్ సిల్కు, వూల్, ప్లెక్సు, (అయితే ప్రత్తినూలు కలిసికొంతగాని, పూర్తిగా గాని తయారయిన వస్త్రములుగాక) మొదలయినవి. రూ. తొమ్మిది న. పై (3) ప్రత్తి నూలువస్త్రములు. (చేతిమగ్గములమీద తయారయినవిగాక) మధ్య తరగతివి. రూ. ఆరు న.పై. (4) ప్రత్తి నూలువస్త్రములు (చేతిమగ్గముల మీద తయారయినవిగాక) ముతకరకము రూ. మూడు న. పై (5) అన్ని రకాలహోజైరీ దుస్తులు [అయితే ప్రత్తినూలు కలిసినవిగాక] మిగిలినవి రూ. తొమ్మిది న. పై. (6) అగ్గిపెట్టెలు. రూ. అయిదు న. పై (7) మోటారుబండ్లు, టాక్సీలు, లారీలు, మో. సైకిల్సు. టాక్సీకేబ్సు, వీని తాలూకు అన్నిరకాల విడిసామానులు, మోటారుట్యూబులు, టైర్సు, బాటరీలుతోసహా, వీనితాలూకు అన్నిరకాల చిల్లరసామానులు (యితరవానికి పనికి వచ్చేవిగాక) రూ. అయిదు న. పై. (8) సైకిల్సు, వీనితాలూకు అన్నిరకాల చిల్లరసామానులు. రూ. మూడు న. పై. (9) కట్టెపుల్లలు. రూ రెండు న. పై. (10) సిమెంటు. అయిదు న. పై. (11) గోనెపట్టాలు. రూ. మూడు న.పై (12) బంగారము. రూ. పావు న.పై (13) బంగారపు వస్తువులు (వానిలో రాళ్ళుపొదిగివుంటే వానిధరలకుగాక) రూ. పావు న. పై (14) నూలుదారం. రూ. అర న. పై. (15) పంచదార. రూ. ఎనిమిది న. పై. (16) కిరసనాయిలు. రూ. మూడు న. పై. (17) బెల్లం రూ. మూడు. న. పై. (18) పొలాలకువాడే రసాయనిక ఎరువులు, చెక్క, ఎముకలపొడి. రూ మూడు న. పై. (19) వేరుశనగనూనె. రూ. రెండు న. పై. (20) దేశీయ సారా రూ. మూడు న.పై (21) అన్నిరకాల సారా దేశీయ సారా గాక) రూ. యిరవైఅయిదు న. పై. (22) గంజాయి, నల్ల

మందు. భంగు. రూ. మూడు న. పై (23) ప్రత్తిగింజలు. రూ. రెండు న. పై (24) సిగరెట్లు పది సిగరెట్లుగలపెట్టి 31 న. పై. లోపు ధర వున్నవాటికి రూ. ఎనిమిది న. పై (25) సిగరెట్లుగల పదిసిగరెట్లుగలపెట్టి 31 న. పై ధరమించివుండేవాటికి రూ. పదహారు న. పై. (26) చుట్టలు, చెరూట్స్ ఒక్కొక్కటి 12 న. పై. లోపు ధర వుండేవాటికి రూ మూడు న. పై. (27) చుట్టలు, చెరూట్స్ ఒక్కొక్కటి 12 న. పై ధర మించివుండేవాటికి రూ. పదహారున. పైసలు (28) గొట్టం పొగాకు, సిగరెట్టుపొగాకు రూ. పదహారు న. పై. (29) బీడీలు, నశ్యం నమిలే పొగాకు మొదలయినవి. రూ మూడు న. పై. (30) ఎలెక్ట్రిక్ హీటింగుఎయిడ్ రూ మూడు న. పై (32) వస్త్రములు, చేతిమగ్గములమీద, పత్తినూలుతో, పూర్తిగాగాని కొంతగాని కలిపివేసినవి. రూ ఒక న. పై. మాత్రము (32) మైకా రూ మూడు న. పై.

వివరణ:- 1, 3, 4. నంబర్లలో, ఫైన్, సూపర్ ఫైన్, మీడియం కోర్సువస్త్రములు, టెక్స్టయిల్ కంట్రోలుఆర్డరు 1948 ప్రకారము నిర్ణయింపబడినవి ఈ చట్టప్రకారము గుర్తింపబడుతవి. అయితే పై ఆర్డరు ప్రకారము గుర్తింపని వస్త్రములను, రాష్ట్రప్రభుత్వమువారే, ప్రత్యేక ఆర్డరు ద్వారా ఏఏ వస్త్రములు ఏఏ తరగతిక్రింద వస్తాయోనిర్ణయించి, ఆయా రేట్ల ప్రకారం పన్ను విధిస్తారు వివరణ (2) దేశీయసారా అనగా [20వ నెంబరు లోనిది.] యిండియాలో తయారయిన సారా. అయితేజిన్, బ్రాంది విస్కీ, రమ్ లాంటి సారాలు, అవిథంగా రంగు,వాసన కలిగేవి యిండియాలోగాని విదేశాలలోగాని తయారయినవిగాక అని అర్థంతీయాలి.

## షెడ్యూలు 3

యీ క్రింద తెలిపిన 10 సరుకులకు శెక్షను 5. సబ్ శెక్షను 3 (బి) ప్రకారము రాష్ట్రములో మొట్టమొదటిసారిగా జరిగిన కొనుగోలుకు మాత్రం ఆయా సరుకులకు, ఆయా రేట్లచొప్పున పన్ను చెల్లించాలి. (అంటే, వీటికి జనరల్ సేల్సుటాక్సు లేదు.)

1. మాంగనీస్, మాంగనీస్ ఓర్. ఆఖరుసారి యీ సరుకును యీ రాష్ట్రములో కొన్న వ్యాపారి రూపాయికి మూడు నయాపైసలు చొప్పున (2) అయిరన్ ఓర్. ఆఖరుసారి ఈ సరుకును ఈ రాష్ట్రములో కొన్న వ్యాపారి రూపాయకు మూడునయాపైసల చొప్పున. (3) దేశవాళీపొగాకు పచ్చిదిగాని, క్యూరింగు చేసిందిగాని, క్యూరింగు చేయనిదిగాని, రూపాయకు

మూడు న. పై. చొప్పున. (4) వర్జీనియా పొగాకు, క్యూరింగు చేసింది గాని, చేయందిగాని, రూ. నాలుగు న. పై. (5) పరిధాన్యము. రూ. మూడు న పై. (6) బియ్యము. రూ. మూడు న. పై. (7) కొబ్బెర కాయలు. రూ. మూడు న. పై. (8) కొబ్బెర చిప్పలు. రూ. మూడు న. పై. (9) పసుపు. రూ. ఆరు న పై. (10) మిలెట్స్. రూ. రెండు న. పై. (గమనిక : 1, 2 సరుకులు ఈ రాష్ట్రములో ఆఖరుసారిగా కొన్న వర్తకులు కొనుగోలు పన్ను చెల్లించవలెను. 3 నుంచి, 10 వరకు గల సరుకులు, మొట్టమొదటిసారిగా ఈ రాష్ట్రములో, జరిగిన కొనుగోలుకు ఆ యా రేట్ల చొప్పున కొనుగోలు పన్ను చెల్లించాలి) వివరణ : 5 నెంబరు లోని పరిధాన్యమునకు, కొనుగోలు పన్ను చెల్లించివుంటే, ఆ ధాన్యము మార్చి తయారైన బియ్యమునకు కొనుగోలు పన్ను చెల్లించనక్కరలేదు.

## షెడ్యూలు 4

"డిక్లేర్డ్ గుడ్స్" ఈ క్రింద తెలిపిన 6 రకాల సరుకులు. 6 శెక్షను ప్రకారము ఒకసారి మాత్రమే సింగిలు పాయింటులో పన్ను చెల్లించాలి, (ఈ సరుకులు 1956 సెంట్రలు సేల్సుటాక్సు యాక్టు 14 శెక్షను ప్రకారం) అంతర్రాష్ట్ర వ్యాపారంలో ప్రత్యేక ప్రాముఖ్యంయిచ్చి ప్రకటింపబడ్డాయి.

1. కోల్. లేక కోక్, ఏరూపాల్లోవున్నా. 2. యినుము, ఉక్కు అంటే (ఎ) ముడి యినుము, యినుపస్క్రాప్. (బి) యినుపప్లేట్లు. రోలింగు మిల్లులలో ఎల్లా తయారు అవుతాయో అదేవిధంగా అమ్మితే. (సి) ఉక్కు స్క్రాప్, ఉక్కుకడ్డీలు, బార్స్, రాడ్స్, యిన్‌గాడ్స్, బైలెట్సు, (డి) ఉక్కుప్లేట్లు (2) షీట్లు, షీట్‌బార్స్, తగరపుబార్స్, 4 కోల్డ్‌స్టీల్ శెక్షన్స్, 5 టూల్ ఎల్లాయిస్టీల్, మిల్లులలో ఎల్లా ఉత్పత్తి అవుతాయో అదేవిధంగా అమ్మితే.

1, 2, సరుకులు ఈ రాష్ట్రములో మొట్టమొదటిసారిగా అమ్మితే అమ్మకపు పన్ను, రూపాయకు రెండు నయాపైసలు చొప్పున చెల్లించాలి.

3. నూనెగింజలు. అన్నిరకాల నూనెగింజలు. మానవ ఉపయోగం నిమిత్తంగాని, పరిశ్రమల ఉపయోగం నిమిత్తంగాని, వార్నీషులు, సోపు, తయారుచేయటానికిగాని, ఔషధాలు, సుగంధద్రవ్యాలు చేసేందుకుగాని, తీసే అన్నిరకాల నూనెగింజలు.

4. నార, వివిధ జాతుల చెట్లనుంచి తీసిన నార.

5. ప్రత్తి, అన్నిజాతుల ప్రత్తి. ముడిపత్తి లేక దిగుమది చేసినప్రత్తి. (అన్ మాన్యుఫాక్చరింగుస్టేటులో నున్నది) గింజలుతీసినా, తీయకపోయినా, బేళ్ళకింద కట్టినా, కట్టకపోయినా, (కాటన్ వేస్టుగాక) ఈ సరుకును రాష్ట్రములోని స్పిన్నింగుమిల్లులు కొంటే ఆవిధంగాకొన్న రేటుకు, ఇతరుల సందర్భములో ఈ రాష్ట్రములో ఆఖరుసారిగా కొన్న వ్యాపారి, రూపాయకు, రెండు నయాపైసలు చొప్పున కొనుగోలుపన్ను చెల్లించాలి.

6. (ఎ) చర్మాలు, తోళ్ళు. (టానింగు కానివి) టానరీ కంపెనీవారు ఈ రాష్ట్రములో కొంటే, ఆ రేటుమీద కొనుగోలుపన్ను, యితరుల సందర్భములో ఈ రాష్ట్రములో ఆఖరుసారిగా ఏ వ్యాపారి కొంటాడో ఆ వ్యాపారి రూపాయకు రెండు నయాపైసలు చొప్పున, కొనుగోలుపన్ను చెల్లించాలి.

బి. టానింగుచేసిన, తోళ్ళు, చర్మాలు:- ఈ రాష్ట్రములో మాన్యుఫాక్చరరు కొంటే, కొన్న రేటుమీద కొనుగోలుపన్ను యితరుల సందర్భములో ఈ రాష్ట్రములో ఆఖరుసారిగా ఏవ్యాపారి కొంటాడో ఆ వ్యాపారి రూపాయకు రెండు నయాపైసలు చొప్పున కొనుగోలుపన్ను చెల్లించాలి.

### షెడ్యూలు 5.

8వ సెక్షను ప్రకారం, ఈ క్రింద తెలిపిన సరుకులు, పన్నునుంచి మినహాయింపబడినవి. 1. ఉప్పు. 2. విద్యుచ్ఛక్తి కర్రెంటు. 3. మోటారు స్పిరిట్. 4. తాటికల్లు.

---

# ది ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సుటాక్సు రూల్సు 1957

## మరియు

## (జి. ఓ నెం. ఎమ్. ఎస్. 1091 రెవిన్యూ. 10 జూన్ 1957)

1. ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సుటాక్సు యాక్టు 1957, లోని సెక్షను 1, సబ్ సెక్షను 3 ప్రకారము, రాష్ట్రగవర్నరుగారు తనకుగల అధి

కారములను పురస్కరించుకొని, ఈ చట్టము 15 జూన్ 1957 నుంచి అమలు లోనికి వచ్చునట్లుగా ప్రకటించారు.

2. శెక్షను 2, క్లాజు (బి) ననుసరించి తమకు సంక్రమించినఅధికారము ననుసరించి రాష్ట్ర గవర్నరు ఈ దిగువ నుదహరించిన ఉత్తర్వులుయివ్వడ మైనది.

II 1. (ఎ) "అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసర్లు" 50 వేల రూపాయలవరకూ టోటలు టర్నోవరుగల వ్యాపారులకు పన్ను విధించేఅధి కారిగా అధికారములను చెలాయించవచ్చును.

(బి) "డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసర్లు" 50 వేల రూపాయలు మించి 5 లక్షల రూపాయలలోపు టర్నోవరుగల వ్యాపారులకు, పన్ను విధించే అధికారిగా అధికారములు చెలాయించుటకును,

(సి) "కమర్షియల్ టాక్సు ఆఫీసర్లు" 5 లక్షలకు మించిన టోటలు టర్నోవరుగల వ్యాపారులకు పన్ను విధింపు అధికారిగా, అధికారములు చెలాయించుటకు నియమింపబడినారు.

సి (1) అయితే పై తెలిపిన అధికారులలో, పెద్ద పదవులుగల అధి కారులు వారి వారి ప్రాంతాలలోని, తమక్రింద ఉద్యోగులకు సంబంధించిన వ్యాపారులకుకూడా, వారివారి యిష్టప్రకారము, వారే స్వయంగా, పన్ను విధించే అధికారిగా, అధికారములను కలిగివుంటారు.

సి (2) అయితే, ఈ క్లాజు ప్రకారం డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసరు, ముందుగా కమర్షియల్ టాక్సు ఆఫీసరుయొక్క అనుమతిని పొంద నిదే తన క్రింది అధికారియొక్క అధికారములను చెలాయించరాదు.

సి (3) ఒకవ్యాపారి అనేకమంది అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసర్లయొక్క ప్రాంతాలలో వ్యాపారాలు సాగిస్తూవుంటే, ఆ వ్యాపారి యొక్క ముఖ్య వ్యాపార స్థలంగాని, హెడ్ ఆఫీసుగాని, ఎక్కడవుం టుందో ఆ ప్రాంతంలోని డిప్యూటీకమర్షియల్ టాక్సు ఆఫీసరుగాని, కమర్షియల్ టాక్సు ఆఫీసరుగాని ఆయా టర్నోవరులబట్టి ఆయావర్తకులకు పన్ను విధించు అధికారులై వుంటారు.

అయితే, ఆ వ్యాపారి ప్రధాన కార్యస్థానమున, రాష్ట్రము వెలుపల వుంటే ఏజిల్లా, కమర్షియల్ టాక్సు ఆఫీసరు, లేదా డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసరు పన్ను విధించే అధికారి అవుతారో, ముందుగా రెవిన్యూ బోర్డువారు ప్రత్యేక ప్రకటనద్వారా ఆయా అధికారులను నియమిస్తారు.

సి (4) ఒకవ్యాపారి స్థిరంగా, ఒకచోటగాని. లేదా శాశ్వతమైన ప్రదేశంగా లేకుండా వ్యాపారాలు సాగిస్తూవుంటే, ఆ వ్యాపారి ఎక్కడ సాధారణంగా నివసిస్తాడో ఆ ప్రదేశంలోని డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసరు లేదా కమర్షియల్ టాక్సు ఆఫీసరు అట్టి వ్యాపారికి పన్ను విధించే అధికారి అవుతారు.

సి (4) 1. అంతే గాకుండా డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసరు లేని ప్రాంతాలలో ఎసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు, పై అధికారి పదవులను చెలాయించవచ్చు.

సి (4) 2. అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు లేని ప్రాంతాలలో డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసరు క్రింది అధికారి పదవులను చెలాయించవచ్చు.

సి (4) 3. పన్ను ఎగవేత నివారణకొరకు ప్రత్యేకముగా నియమింపబడిన, ఒక కమర్షియల్ టాక్సు ఆఫీసరు, ఏ వర్తకుడయినా, అతడు ఏ తరగతి వ్యాపారి అయినా, పన్ను ఎగవేస్తున్నట్లు లేదా లెక్కల పుస్తకాలు దాచిపెట్టుతున్నట్లు లేదా దొంగ వ్యాపారము చేస్తున్నట్లు లేదా మోసబుద్ధితో చేయాలని బుద్ధిపూర్వకంగా పన్నులు ఎగవేయుచర్యలు జరుపుతున్నట్లు వారి దృష్టికి వచ్చినా, లేక వారికి తెలిసినా వారి యిష్టప్రకారము ఆ వ్యాపారికి అతడు ఏతరగతి వ్యాపారి అయినా సరే, తానే స్వయముగా పన్నువిధించే అధికారిగా, తనకుగల అన్ని అధికారాలను, పదవులను చెలాయించవచ్చు.

III. ఈ చట్టములోని 2 శెక్షను, క్లాజు (బి) ననుసరించి రాష్ట్ర గవర్నరుగారు, ఈ చట్టప్రకారము పన్నువిధించే అధికారులను లేక వ్యక్తులను నియమించుటకు రెవిన్యూబోర్డుకు తగు అధికారములను కలుగజేసినారు.

IV. ఈ చట్టములోని శెక్షను 9. సబ్ శెక్షను 1 ప్రకారము గవర్నరుగారు ఈ క్రింద తెలిపిన సరుకులను అమ్మకపు పన్నునుంచి మినహాయించినారు.

1. మొక్కజొన్న కండెలు

2. ఎండుగడ్డి, పచ్చగడ్డి.

3. పాలు, పెరుగు, మజ్జిగ.

4. పువ్వులు. 5. గుడ్లు. 6. మాంసము. (అయితే ఎండబెట్టినది. డబ్బాలలోగాని, మంచులోగాని, నిల్వవుంచినది, లేదా వండినది గాక) 7. పళ్ళు. (కొబ్బెరకాయలు గాక) అయితే ఎండబెట్టినవి, డబ్బాలలో

గాని మంచులోగాని నిల్వజేసినవిగాక. 8. కూరగాయలు. (బంగాళా దుంపలు ఉల్లిపాయలుగాక) అయితే ఎండబెట్టినవి, నిల్వజేసినవి గాక 9. చేపలు. (డబ్బాలలో పెట్టినవికాక) 10. చరఖాలు. వాటి తాలూకు సామానులు 11. బొగ్గు తయారుచేసే స్థలంలో అమ్మిన అమ్మకం. 12. మట్టి పని. కంకరరాతి గనులు త్రవ్వ కంట్రాక్టులు. 12. ఎక్స్‌రే, ఎక్స్‌రే ఫోటోలు. 14. రోగనిర్ణయానికి తీయబడిన ఎక్స్‌రే ఫోటోలు. 15. ప్రయివేటు మెడికలు ప్రాక్టీషనర్స్, తమ స్వంత ఆసుపత్రులలో, ఔషధము లను కలిపియిస్తే అట్టివి. 16. బలపములు, పలకలు 17. భారత ప్రభుత్వమువారి ప్రచురణలు. 18. రాష్ట్ర ప్రభుత్వమువారి స్టేషనరీని డిపార్టుమెంటువారు స్టేషనరీని ఏ రాష్ట్రప్రభుత్వ శాఖలకైనా సప్లయిచేస్తే ఆ సప్లయిలమీద. 19. విశ్వవిద్యాలయములవారి ప్రచురణలు. 20. అన్ని రకాల పురాణగ్రంథాలు, బైబిలు, ఖొరాను మొదలగు మతగ్రంథాల అమ్మకాలమీద.

(అయితే పైన తెలిపిన పురాణగ్రంథాలు లేదా మత గ్రంథాలు అమ్మేవారు, ఆయా మతగ్రంథాలుతప్ప తదితర మైన పుస్తకాలు, గ్రంథాలు అమ్మనివారికి మాత్రమే యీ మినహాయింపు).

21. చేతితో ఒడికిన నూలుగాని, అట్టి నూలుతో నేసిన దుస్తులు (ఖద్దరు)గాని, (పైన తెలిపిన సరుకులయొక్క అమ్మకము పన్నునుంచి మినహాయింపబడ్డాయి) పైన తెలిపిన సరుకులే గాకుండా.

ఆంధ్రప్రదేశ్, జనరల్ సెల్స్‌టాక్సు శెక్షను (9) (1) అనుసరించి గవర్నరుగారు యీ దిగువవస్తువులను పన్నునుండి మినహాయించినారు:—

V. ఆసుపత్రులలో రోగులకు సప్లయిచేసే ఆహార పదార్థములమీద అమ్మకం. (సె 5) (1)

VI. ఆల్ ఇండియా ఖాదీ అండ్ విలేజి యిండస్ట్రీసు బోర్డువారిచే గాని, కో ఆపరేటివ్ సొసైటీలవారిచేగాని దంపుడు బియ్యం తయారుచేయటానికి కొన్న వడ్లకు, కొనుగోలు పన్నునుంచి లేదా దంపుడుబియ్యం కొంటే ఆ బియ్యానికి కొనుగోలు పన్నునుంచి మినహాయింపబడినవి. (సె॥5(1) (b)

VII. ఆంధ్రరాష్ట్రములోని అన్ని బ్యాంకులను అయితే అట్టి బ్యాంకులు ఒక వ్యాపారి తరఫున సరుకులు కొనుట, అమ్మట 11 శెక్షను లేదా 2 శెక్షను (సి) క్లాజులో తెలిపిన ప్రకారము అట్టి పనులుచేయు ఏజంటుగా లేని సందర్భములో గల అన్ని బ్యాంకులు అమ్మకం పన్ను చెల్లించనక్కర లేదు. (శె॥ 11 (2) (c)

VIII. మిల్లునూలుతో తయారైన చేనేత వస్త్రములలో మాత్రమే వ్యాపారముచేయు వర్తకుడు ఈ పన్నునుండి మినహాయింపబడ్డాడు. అయితే అట్టి వ్యాపారి పై చేనేతవస్త్రాలే గాకుండా మిల్లువస్త్రములుకూడా కలిపి వ్యాపారముచేస్తే ఆ వ్యాపారి ఈ రాష్ట్రములో మొదటి అమ్మకందారు కాకుండా వుండవలెను.

XI. తవుడు, వూక అమ్మకముమీద పన్ను లేదు. (అయితే యీ వూక, తవుడు కొనుగోలుపన్ను చెల్లించిన ధాన్యంనుంచి తయారు అయి వుండాలి.

X. విద్యాసంస్థలు, అందులో చదువుకొనే విద్యార్థులనుంచి నెల వారీ భోజనము మొదలయినవాటి నిమిత్తము కొంత మొత్తము వసూలుచేస్తూ వుంటే అట్టి మొత్తాలమీద పన్ను లేదు.

(అయితే ఈ విధంగా విద్యార్థులనుంచి వసూలుపర్చేది వారి నిమిత్తమే ఖర్చు చేయబడుతుందని ఈ సందర్భంలో లాభాలను దృష్టిలోనుంచుకొని వసూలు చేయటంలేదని యిందులో ఏ లాభం లేదని ఆ యా విద్యాసంస్థలు బుజువుచేయాలి.)

XI. ఏ వ్యక్తి అయినా విద్యుచ్ఛక్తితో గాకుండా ఒక దేశవాళీ నూనె గానుగగాని, ఆయిల్ ప్రెస్‌గాని వుంటే అట్టి గానుగలో ఆడిన నూనె ఆ వ్యక్తి అమ్ముకుంటూవుంటే ఆ మొత్తాలమీద పన్ను లేదు.

XII. ఒక కోఆపరేటివ్ సంఘానికి ఒకటిగాని అనేక దేశవాళీ నూనె గానుగలుగాని, ఆయిలు ప్రెస్‌లుగాని, వుండి అవి విద్యుచ్ఛక్తితో గాని యితర యంత్రశక్తితోగాని నడుపబడకుండావుంటే ఆ గానుగలమీద తయారయిన నూనె అమ్మకాలమీద పన్ను లేదు.

XIII. ఏ వ్యాపారి అయినా బంగాళాదుంపల వ్యాపారం చేస్తూ వుంటే అట్టి బంగాళాదుంపల సంవత్సర అమ్మకం 20 వేల రూపాయలు దాటకుండావుంటే ఈ విధంగా పన్ను చెల్లించాలి. టర్నోవరు 15 వేలు దాటకుండా వుంటే 96 రూపాయిలు 15 వేలు దాటి 20 వేలు లోపు అయితే 144 రూపాయలు [సంవత్సరమునకు] ఒకసారి మాత్రమే (సె॥ 5 (1)

XIV. ఏ వ్యాపారి అయినా ఉల్లిపాయల వ్యాపారం చేస్తూ వుంటే ఆ వ్యాపారం 20 వేలు దాటకుండావుంటే ఈ విధంగా [పన్ను చెల్లించాలి. సంవత్సరానికి రూ 12,500 దాటకుండావుంటే సంవత్సరానికి 48 రూ. 12,500 నుంచి 20 వేల రూపాయలలోపు 72 రూపాయిలు.

(సె|| 5 (2)

XV. ఈ చట్టములోని 8, 9, 11, శెక్షన్ల ననుసరించిక్రింద తెలిపిన అధికారులు లైసెన్సింగు అధికారులుగా నియమింపబడిరి.

1. ఈ చట్టప్రకారము పన్ను చెల్లించవలసిన వ్యాపారుల సందర్భములో పన్ను విధింపు అధికారి.

2. ఇతర సందర్భములలో ఆ వ్యాపారియొక్క ప్రధాన కార్య స్థానము, ఎవరి అధికార హద్దులలో వుంటుందో, అచ్చటగల అసిస్టెంటు కమర్షియల్ టాక్సు అఫీసరు.

XVI. ఈచట్టములోని 28 శెక్షను ప్రకారం రాష్ట్రిగవర్నరుచే ఈ క్రింద తెలిపిన అధికారులు ఆయా అధికారములను చెలాయించుటకు నియమింపబడినారు. [ఎ] కమీషనర్ ఆఫ్ కమర్షియల్ టాక్సెస్. శెక్షను 28 లో సబ్ శెక్షన్లు 1 నుంచి 6 వరకూ గల అధికారము. రాష్ట్రిములో ఎక్కడనయినాసరే చెలాయించవచ్చు. [బి] డిప్యూటీ కమీషనర్సు ఆఫ్ కమర్షియల్ టాక్సెస్ కమర్షియల్ టాక్సు. ఆఫీసర్సు, [[ప్రత్యేకంగా పన్ను ఎగవేత నివారణకు నియమింపబడినవారుకూడా] డిప్యూటి కమర్షియల్ టాక్సు ఆఫీసర్లు, అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసర్లు [పన్నులు ఎగ వేత నివారణకు నియమింపబడినవారుకూడా] శెక్షను 28 లోని 1 నుంచి 6 సబ్ శెక్షన్ల ప్రకారము వారి వారి ప్రాంతాలలో అధికారములను చెలాయించవచ్చును. [సి] కమర్షియల్ టాక్సు యిన్స్పెక్టర్లు [పన్ను ఎగవేత నివారణకు నియమింపబడినవారుకూడా] సబ్ సెక్షను, 1, 2, లేక 4 ప్రకారము పద్దులు పరిశీలించటానికి కూపి తీయటానికి వారివారి ప్రాంతాలలో అధికారములను చెలాయించవచ్చును.

XVII. ఈ చట్టములోని 29 శెక్షను ప్రకారము రాష్ట్రి గవర్నరుచే యీ క్రింద తెలిపిన అధికారులకు, ఆయా అధికారములు చెలాయించుటకు నియమింపబడినారు.

(ఎ) కమీషనర్ ఆఫ్ కమరియల్ టాక్సెస్ : 29 శెక్షనులోని 2, 3 సబ్ శెక్షన్ల ప్రకారము రాష్ట్రిములోని ఏ ప్రదేశములోగాని, ఏ పరిహద్దులలోగాని, తనిఖీ ఆఫీసుల వద్దగాని అధికారములను చెలాయించ

వచ్చును. [బి] డిప్యూటీ కమీషనర్లు, కమర్షియల్ టాక్సు ఆఫీసర్లు, అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసర్లు, పన్ను ఎగవేత నివారణకు, నియమింపబడిన అధికారులుకూడా 29 శెక్షనులోని 2, 3 సబ్ శెక్షన్ల ప్రకారము వారి వారి ప్రాంతాలలో అధికారములను చెలాయించ వచ్చును. [సి] తనిఖీ ఆఫీసులవద్ద ఉద్యోగస్థులు 29 శెక్షను, 2, 3 సబ్ శెక్షన్ల ప్రకారం సరిహద్దులవద్ద అధికారములచు చెలాయించవచ్చును. [డి] కమర్షియల్ టాక్సు యిన్స్పెక్టర్లు, పన్ను ఎగవేత నివారణకు ప్రత్యేకముగా ఏర్పాటు చేయబడినవారు, 2 వ శెక్షనులోని అధికారములను చెలాయించవచ్చును.

XVIII. 1957—58 సంవత్సరములతాలూకు సేల్సుటాక్సు వసూలు చేయు సందర్భములో యీచట్టము అమలుకురాక పూర్వము, పాతచట్టములో తెలుపబడిన విధముగాను; యీచట్టము అమలులోనికి వచ్చిన తరువాత ఈ చట్టములో తెలుపబడిన విధముగాను పన్నులను వసూలు చేయవలసిందిగాను తాత్కాలికముగా విధించిన పన్నును మార్చవలసిందిగా గవర్నరుచే నిర్ణయింపబడినది.

జి. ఓ. నెం. ఎమ్. యస్. 1136 రెవెన్యూ, 14 జూన్ 1957

1. ఈ చట్టములోని 3 శెక్షను ప్రకారము, రాష్ట్ర గవర్నరుచే ది 15 జూన్ 1957 నుంచి, ఆంధ్రప్రదేశ్ అప్పిలెట్ ట్రిబ్యూనలును స్థాపిస్తూ శ్రీ వి. సత్యనారాయణ అనువారిని అధ్యక్షులుగాను, శ్రీ పి. యస్. నారాయణరావు, శ్రీ డి. రామదాసు అనువార్లను సభ్యులుగాను. సదరు సంఘాన్ని ఏర్పాటుచేస్తూ నిర్ణయించారు.

2. ఈ చట్టములోని 4 శెక్షను ప్రకారము, యీ చట్టము అమలులోనికి వచ్చిన వెంటనే ఆంధ్రప్రదేశ్‌లోని, ఆంధ్రజిల్లాలలోగల డిప్యూటీ కమీషనర్లు, కమర్షియల్ టాక్సు ఆఫీసర్లు, వారికొరకు నిర్ణయింపబడిన అధికారములను పూర్వమువలె వారి వారి, ప్రదేశములలో కొత్త అధికారములను చెలాయించ వలసిందిగా, రాష్ట్రగవర్నరుచే ఆజ్ఞాపింపబడినారు.

3. ఈ చట్టములోని 42 శెక్షను 1 సబ్ శెక్షను ప్రకారము ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణాలో పూర్వ హైదరాబాదు జనరల్ సేల్సు టాక్సు యాక్టు 1950 ననుసరించి పిలువబడే, సేల్సుటాక్సు ఆఫీసర్లు, అసిస్టెంటు సేల్సుటాక్సు ఆఫీసర్లు అను ఉద్యోగస్థులు, యీ చట్టము అమలులోనికి వచ్చినవెంటనే కమర్షియల్ టాక్సు ఆఫీసర్లని, అసిస్టెంటు కమర్షి

యల్ టాక్సు ఆఫీసర్లనిన్నీ పిలువబడుతూ వుండాలని, పూర్వమువారు ఏ ప్రాంతాలలో అధికారులై వున్నారో యిప్పుడుకూడా అదే ప్రాంతాలకు, అధికారులై వుంటారని, యీ చట్ట ప్రకారము, వారికి సంక్రమించే అన్ని అధికారములు, కలిగి వుంటారని, యీ చట్ట నిబంధనల ప్రకారము రాష్ట్రగవర్నరుచే ప్రకటింపబడినది.

4. ది 15 జూన్ 1957 నుంచి తెలంగాణాలో యీ చట్టమును అమలులో పెట్టుటకు డిప్యూటీ కమీషనర్లయొక్క ప్రాంతాలను యీ విధముగా వుండాలని ప్రభుత్వముచే ప్రకటింపబడింది.

(1) హైదరాబాదు డివిజన్:- హైదరాబాదు జిల్లా, హైదరాబాదులో కార్యాలయము.

(2) నిజామాబాద్ డివిజన్:- మేదక్, కరీంనగర్, నిజామాబాద్, అదిలాబాద్ రెవిన్యూ జిల్లాలు. ప్రధాన కార్యాలయము హైదరాబాద్.

(3) వరంగల్ డివిజన్:- వరంగల్, ఖమ్మం, నల్గొండ, మహబూబ్ నగరం, ప్రధానకార్యాలయము హైదరాబాద్.

## ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సుటాక్సు రూల్సు : 1957

(జూన్ 15వ తేదీన ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటింపబడెను)

1. ఈరూల్సు 1957 సం. ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సుటాక్సు రూల్సు అని పిలువబడును.

2. ఇవి 1957 జూన్ 15 వ తేదీనుంచి అమలులోనికి వచ్చును.

3. ఈ రూల్సులో సందర్భానుసారంగా మరో అర్థం రాకుండా ఉంటే—

(ఎ) "యాక్టు" అనగా ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సుటాక్సు యాక్టు 1957 అని అర్థం

(బి) "అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు" డిప్యూటీ కమీషనరు ఆఫ్ కమర్షియల్ టాక్సెస్ వారిచే పేరుమీదగాని, ఆఫీసు హోదాలోగాని అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు అధికారాలను చెలాయించుటకు నియమింపబడిన వ్యక్తి; మరియు

(1) పన్నుల ఎగవేత నివారణకై ఈ చట్టము క్రింద నియమింపబడిన స్పెషల్ అసిస్టెంటు కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు

(2) అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు పదవి, అధికారము లను చెలాయించుటకై నియమింపబడిన అడిషనల్ అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు.

(సి) "కమ్మర్షియల్ టాక్సు యినస్పెక్టరు" అనగా డిప్యూటీ కమీషనరుచే, పేరుమీదగాని లేదా ఆఫీసుహోదాలోగానీ కమ్మర్షియల్ టాక్సు యినస్పెక్టరు అధికారములను చలాయించుటకు నియమింపబడినవ్యక్తి

(డి) "డిప్యూటీ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు" అనగా డిప్యూటీకమీషనరుగారిచే పేరుమీదగాని లేదా ఆఫీసుహోదాలోగాని డిప్యూటీ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు అధికారములను చలాయించుటకు నియమింపబడిన వ్యక్తి. మరియు డిప్యూటీ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు పదవి, అధికారములు చెలామణి చేయుటకై నియమింపబడిన అడిషనల్ డిప్యూటీ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు.

(ఇ) "ఫారం" అనగా ఈ రూల్సుకు అనుబంధము చేయబడిన ఒక ఫారము—

(యఫ్) "గవర్నమెంటు ట్రెజరీ" అనగా రాష్ట్ర ప్రభుత్వమువారి ట్రెజరీగానీ, సబ్ ట్రెజరీగానీ—

(జి) "లైసెన్సింగ్ అధికారి" అనగా 8, 9, మరియు 11 శెక్షన్లక్రింద లైసెన్సులు యిచ్చు అధికారి—

(హెచ్) "నెల" అనగా క్యాలెండరు నెల—

(ఐ) "రిజిష్టరింగ్ అధికారి" అనగా శెక్షను 12 క్రింద రిజిస్ట్రేషనుకు దరఖాస్తు చేసుకొను వ్యాపారియొక్క ప్రధాన కార్యాలయము ఏప్రాంతములో వుంటుందో, ఆ ప్రాంతములో అధికారము కలిగియుండు అసిస్టెంటు కమ్మర్షియల్ టాక్సు అఫీసరు—

(జె) "శెక్షను" అనగా చట్టముయొక్క శెక్షను—

(కె) "స్టేట్ రిప్రజెంటేటివ్" అనగా సేల్సుటాక్సు అప్పిలేట్ ట్రిబ్యూనల్ ముందు అప్పీలు సందర్భములో రాష్ట్ర ప్రభుత్వము తరఫున హాజరగుటకు రాష్ట్రప్రభుత్వమువారిచే నియమింపబడిన వ్యక్తి, వారు కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు హోదాకు తక్కువగాని అధికారులై వుంటారు—

అప్పిలేట్ ట్రిబ్యూనలు:—అధ్యక్షులుగాక అప్పిలేట్ ట్రిబ్యూనల్ లో ఇద్దరు సభ్యులుంటారు. అందులో ఒకరు కమ్మర్షియల్ టాక్సు డిపార్టుమెంటులో డిప్యూటీకమీషనరు హోదాకుతక్కువకాని ఒక అధికారి అయివుండవలెను. రెండవవారులెక్కలలో పరిచయము, విజ్ఞానము, నియమింపబడి తదితర అర్హతలుండి కమ్మర్షియల్ టాక్సు డిపార్టుమెంటుకు సంబంధించని వ్యక్తి అయి ఉండవలెను.

5. ఈ క్రింద ఉదహరించిన సరుకుల సందర్భములో, ఈ రూల్సుకు సంబంధించినంతవరకు, ఒక వ్యాపారస్తుని టర్నోవరు తేల్చవలెనంటే, ఆ వ్యాపారి ఆయా సరుకుల కొనుగోళ్ళకై యిచ్చినట్టి మొత్తములను, అట్టి వ్యాపారియొక్క టోటలు టర్నోవరుగా పరిగణింపబడుతుంది.

(ఎ) మాంగనీసు, (మాంగనీసు ఓరుతోసహా) (బి) ఐరన్‌వోరు, (సి) నాటుపొగాకు, (పదును చెయ్యబడినదిగాని, పదును చెయ్యబడనిదిగాని) (డి) వర్జీనియాపొగాకు, (పదును చేయబడినదిగాని, పదును చేయబడనిదిగాని) (ఇ) వడ్లు, (యఫ్) బియ్యము, (వడ్లుగా పన్నువిధింపబడనవి) (జి) కొబ్బరి కాయలు, (హెచ్) కొబ్బరి, కురిడీ (ఐ) పసుపు, (జె) జొన్నలు వగైరా (కె) నూనెగింజలు, (అనగా ఆవిరికాని నూనెలనుయిచ్చునవి.) మానవఉపయోగం నిమిత్తంగాని, పరిశ్రమలలో ఉపయోగ నిమిత్తంగాని వార్నిషులు, సబ్బులు వగైరా తయారుచేయుటకుగాని ఔషధములు, సుగంధద్రవ్యములు తయారు చేయుటకుగాని ఉపయోగపడు (ఆవిరిఅగు) నూనెల ఉత్పత్తికి ఉపయోగపడు నూనెగింజలు. (యల్) జనపనార, (నారజాతి చెట్లనుండి తీసిననార) మూటకట్టబడినవి (యం) ప్రత్తి, అనగా అన్నిరకముల ప్రత్తి. (దేశవాళీ, లేక దిగుమతి ఐనది) దానిని మార్పు చెందని స్వరూపములో విత్తులను వేరుచేయు బడిన లేదా వేరు చేయుబడని, బస్తాలలో కట్టబడిన, అణచబడిన లేదా మరే విధముగానైననూ, (కాని కాటనువేస్టు మాత్రము కాదు) (యన్) తోళ్ళు చర్మములు (పదును చేయుబడిన లేదా పదును చేయబడనివి)

6. (1) శెక్షను 5 లేక 6 క్రింద చెల్లించవలసిన లేదా శెక్షను 9 (1) క్రింద ప్రకటింపబడిన అన్నిపన్నులు. ఆ వ్యాపారియొక్క, నికరమైన టర్నోవరుపైన విధింపబడును. టర్నోవరు నిర్ణయించునపుడు (ఎ) నుంచి, (యల్) వరకు గల సబ్‌క్లాజులలో వివరింపబడిన విధముగా వాటి షరతులకు లోబడి, ఒక వ్యాపారస్తునియొక్క మొత్తము టర్నోవరునుండి మినహాయింపబడవలెను.

(ఎ) వట్టముగా నంగీకరింపబడిన అన్ని మొత్తములు, అట్టి వట్టము ఆ వ్యాపారియొక్క నిత్య ఆచారము ప్రకారము అనుసరించబడవలెను. ఒక

ప్రత్యేక సందర్భములో కంట్రాక్టు లేక ఎగ్రిమెంటు వ్రాసుకున్నచో, వాటి షరతుల ననుసరించబడవలెను. ఆవ్యాపార లెక్కలలో ఇవ్వబడిన పట్టము పోను మిగతా సొమ్ము మాత్రమే కొనుగోలుదారుడు "టర్నోవరు" గా చూపవలెను.

బి (i) అమ్మకపుపన్ను విధింపబడే అన్ని సరుకుల సందర్భములో, ఆ సరుకులు కొనుగోలుదార్లనుండి త్రిప్పివేయబడినచో, కొనుగోలుదార్లకు రిఫండుఇచ్చిన మొత్తము. ఐతే, ఆ వస్తువులు ఏ తేదీన త్రిప్పిపంపబడినదీ, ఎంత సొమ్ము ఎప్పుడు రిఫండు ఇచ్చినదీ లెక్కలలో చూపవలెను.

(ii) కొనుగోలు పన్ను విధింపబడే అన్ని సరుకుల సందర్భములో, ఆ సరుకులు అమ్మకముదారులనుండి వ్యాపారస్తులకు త్రిప్పిపంపబడిన సందర్భములో అమ్మకముదారులనుండి వచ్చిన అన్ని మొత్తములూ, ఐతే లెక్కలలో ఆ సరుకులు ఏ తేదీన త్రిప్పిపంపబడినవీ, ఏ తేదీన ఎంతసొమ్ము రిఫండు వచ్చినదీ చూపవలెను.

(సి) ఒక వ్యాపారస్తుడు, వాడుకగా తన అంగడిలో కొనువానిని తృప్తిపరచుటకై, తన సరుకులు కానట్టివస్తువులను యితర వ్యాపారస్తుల నుండి తెప్పించి, వెంటనే సదరు వ్యక్తికి అమ్మినచో అట్టి అమ్మకములు, అట్టి అమ్మకములు "వసతి అమ్మకముగా" "ఎకామడేషన్ సేల్" అను పేరుతో లెక్కలలో వ్రాయవలెను. ఆ సరుకులు ఎవరి వద్దనుంచి తీసుకొని రాబడినవో ఆ వ్యాపారి పేరుకూడా నమోదుచేయవలెను. ఇట్టి అమ్మకము వలన వసతి యిచ్చునట్టి వ్యాపారస్తుడు లాభము పొందకూడదు.

(డి) 5 వ షెడ్యూలులో ఉదహరించిన సరుకుల అమ్మకముల అన్ని మొత్తములూ.

(ఇ) శెక్షను 9 (1) ప్రకారం ప్రకటన పూర్వకముగా పన్నునుంచి మినహాయింపబడిన అన్ని అమ్మకములు, లేక కొనుగోళ్ళ మొత్తములు. ఐతే అట్టి మినహాయింపుకు సంబంధించిన, నిబంధనలు అన్నియూ అంగీకరించబడవలెను.

(యఫ్) శెక్షను 11 క్రింద లైసెన్సు పొందిన వ్యక్తి అమ్మిన అన్ని అమ్మకములూ, కొనిన అన్ని కొనుగోళ్ళూ. ఐతే అట్టి అమ్మకములూ, కొనుగోళ్ళూ ఈ చట్టములోని, రూల్సులోని నిబంధనల ప్రకారం జరపబడాలి.

(జి) ఈ క్రింద ఉదహరించిన రెండు శీర్షికల క్రిందకు వచ్చేవి అన్ని మొత్తములు, ఐతే అవి ప్రతేకముగా చూపబడి, వ్యాపారిచేత ప్రత్యేక

ముగా వసూలు చేయబడవలెను. అట్టి మొత్తములు అమ్మిన వస్తువుల ధరలో చేర్చకూడదు.

(i) రేవు (ii) ప్యాకింగ్, డెలివరీ మొదలగు యితర సేవలకు వసూలు చేయు మొత్తములు.

(హెచ్) ఒక వ్యాపారిచేత తన వ్యాపారము మొత్తము అమ్మకము ద్వారా సంపాదించిన అన్ని మొత్తములూ.

(ఐ) II, III, IV షెడ్యూల్సులో ఉదహరించిన సరుకుల అమ్మకములు లేక కొనుగోళ్ళు; ఈచట్టంలోని ఏ నిబంధనల ప్రకారమైననూ పన్నునుండి మినహాయింపబడినచో, అట్టి సరుకుల అమ్మకములు లేక కొనుగోళ్ళు.

(జె) 1956 సం. సెంట్రల్ సేల్సుటాక్సు యాక్టుక్రింద పన్ను విధించబడు సరుకులకు అమ్మకముల మొత్తములు.

(కె) రూలు 25 క్రింద ఉదహరించిన అన్ని నిబంధనలకూలోబడి వేరుశెనగనూనె (శుద్ధిచేయబడిన నూనెగాక) ఉత్పత్తిలో రిజిష్టర్డు డీలరుకు యివ్వబడిన అన్ని మినహాయింపులూ;

(యల్) రూలు 26 క్రింద ఉదహరించి అన్ని నిబంధనలకులోబడి చుట్టలు, నశ్యము ఉత్పత్తిదారులకు యివ్వబడిన అన్ని మినహాయింపులూ;

(2) I వ సబ్ రూలు అభిప్రాయమునకు వర్క్సుకంట్రాక్టు చేయు వ్యాపారియొక్క టర్నోవరు తేల్చుటకు ఆ వ్యాపారి నిర్వహించిన కంట్రాక్టులో ఉపయోగించిన సరుకుల ధరలు, ఆ వ్యాపారిలెక్కలనుండి కనుగొనుటకు వీలులేని సందర్భములో ఆ కంట్రాక్టు నడుపుటకు అతనికి ఇవ్వబడిన మొత్తంనుండి, బోర్డు ఆఫ్ రెవిన్యూవారిచే వివిధ ప్రాంతములకు ఎప్పటికప్పుడు లేబరు ఖర్చులకూ, ప్రధాన పదార్థముల ధరలకూ, ఆయా ప్రాంతములకు మామూలుగా సంబంధించినరీతిగా నిర్ణయించిన శాతము మొత్తములను మినహాయించి, నిర్ణయించవలెను. అధికశాతము ఈ క్రింది విధముగా నుండవలెను—

| | శాతము |
|---|---|
| (ఎ) (i) ఎలక్ట్రో ప్లేటింగ్ కాని ఎలక్ట్రికల్ కంట్రాక్టుల సందర్భములో— | 20 |
| (ii) ఎలక్ట్రోప్లేటింగు కంట్రాక్టుల సందర్భములో— | 27 |

(బి) కట్టడసంబంధమైన కంట్రాక్టుల సందర్భములో— 30

(సి) శానిటరీ కంట్రాక్టుల సందర్భములో— 30 1/3

(డి) నేత సంబంధమైన దుస్తులు, వాటి అద్దకములు (రంగువేయుట), అచ్చువేయు (ప్రింటింగు) సందర్భములో— 50

(ఇ) గడియారముల, చేతిగడియారముల రిపేరు, కంట్రాక్టుల సందర్భములో— 50

(యఫ్) శిల్పవిద్య సంబంధమైనట్టి, కళకు సంబంధమైనట్టి కంట్రాక్టుల సందర్భములో— 70

(జి) ఇతర కంట్రాక్టు సందర్భములో— 30

7. (1) ఈ రాష్ట్రములో ఒకటికంటె ఎక్కువ వ్యాపారస్థలము లున్న వ్యాపారస్తుల సందర్భములో, ఆ వ్యాపారి ప్రధానకార్యాలయము వారిచే, వారి అన్ని బ్రాంచీల టర్నోవరులను ఉదహరించుచూ, ఈ రూలు ప్రకారము నిర్ణయింపబడిన అన్ని ఫారములు పంపవలెను.

ప్రతి బ్రాంచికూడా.

(a) ఆయాప్రాంత పన్నువిధింపు అధికార్లకు తను బ్రాంచి టర్నోవరును చూపు రిటరన్‌ను ఫారం "ఎ.1"లో గాని, ఫారం "ఎ-2"లో గాని పంపవలెను.

(b) తమ ప్రధాన కార్యాలయముయొక్క అడ్రసునిచ్చుచూ, తమ బ్రాంచి టర్నోవరు తెలుపు రిటరన్ తమప్రధాన కార్యాలయంవారి రిటర్నులో చూపబడినదని తెలియజేయవలెను.

(2) ఒక వ్యాపారి పన్ను చెల్లింపవలసివచ్చునా? లేదా? అను విషయములను నిర్ణయించుటకు యీ రాష్ట్రములోని అతని అన్ని వ్యాపారస్థలముల టర్నోవరునుకూడా విచారించవలెను.

8. ఈచట్టముక్రింద పన్ను చెల్లించలసిన ప్రతి వ్యాపారస్తుడూ ఈ చట్టము అమలులోనికి రాకపూర్వము వ్యాపారము చేయుచున్నచో, ఆ ప్రాంతముయొక్క పన్నువిధింపు అధికారికి ఈ చట్టము అమలులోకివచ్చిన తేదీనుండి 30 రోజులలోపల, వివిధపన్నుల రేట్లకు సంబధించిన వివిధ వస్తువులకు సంబధించిన మొత్తములను ప్రత్యేకముగా చూపుచూ, గతించిన 12 మాసములకు తన టర్నోవరును, నికరటర్నోవరును ఫారం "ఎ-1"లోని రిటరన్‌లో ఇవ్వవలెను.

9. (1) తమ టర్నోవరుతో నిమిత్తము లేకుండా, 1957 జూన్ 15వ తేదీ తరవాత వ్యాపారము ప్రారంభించుచు ఈ చట్టములో శెక్షను 5 (3) ప్రకారం గాని, శెక్షను 6 ప్రకారం గాని పన్ను విధింపబడు సరకులలో వ్యాపారము చేయు ప్రతి వ్యాపారస్తుడూ, ఈ రాష్ట్రములో నివసించని వ్యాపారియొక్క ప్రతి ఏజంటూ, మరియు 1957 జూన్ 15 వ తేదీ తర్వాత వ్యాపారము ప్రారంభించు, అవకాశవ్యాపారి కాని ప్రతి వ్యాపారస్తుడూ తమ వ్యాపారము ప్రారంభించిన నాటినుండి మొదటి 12 నెలల్లో అంచనా వేయబడిన టర్నోవరు 10 వేలరూపాయలకు తక్కువ కానిచో, తనవ్యాపారము ప్రారంభించిన నాటినుండి 30 రోజులలోపల తన వ్యాపారము ముఖ్య కార్యస్థానముగల ప్రాంతపు పన్నువిధింపు అధికారికి తన మొదటి 12 నెలలలో అంచనా మొత్తమునూ, నికరటర్నోవరునూ, తెలుపుచూ ఫారం "ఎ" లో ఒక రిటరన్ ను పంపవలెను.

(2) అవకాశ వ్యాపారికాని ప్రతి వ్యాపారస్తుడు వ్యాపారము చేయుచూ, సబ్ రూలు (1) ప్రకారము రిటరన్‌ను పంపకపోతే, తన టర్నోవరు 10 వేల రూపాయలు అనగానే అట్టి తేదీనుండి 30 రోజులలోపల తన ముఖ్యకార్యస్థానమునగల ప్రాంతపుపన్ను విధింపు అధికారికి ఫారం "ఎ" లో ఒక రిటరన్ ను పంపవలెను.

10. పన్ను విధింపు అధికారి, వ్యాపారస్తునియొక్క లెక్కలను పరిశీలించి, అవసరమైన యితర విచారణలు జరిపి, రూలు 8, లేక 9 ప్రకారం వ్యాపారి పంపిన రిటరన్ సరియైనదనియూ, పూర్తిగ నున్నదనియూ తృప్తిపడినచో, శెక్షను 5 లేక 6 ప్రకారం విధింపబడిన, శెక్షను 9 (1) ప్రకారం ప్రకటింపబడిన రేట్ల ప్రకారం, ఆ రిటరన్‌ను ఆధారం చేసుకొని సంవత్సరమునకు ఆ వ్యాపారి చెల్లించవలసిన పన్నును తాత్కాలికముగా నిర్ణయించవచ్చును.

11. రూలు 8 లేక 9 ప్రకారము కోరబడిన రిటరన్ ను వ్యాపారి పంపకపోయిననూ, పంపబడిన రిటరన్ సరియైనది కాదనిగానీ, పూర్తిగా లేదనిగానీ పన్ను విధింపు అధికారి అభిప్రాయపడినచో, రూలు 12 లో తెలిపిన చర్యలు జరిపిన పిమ్మట; తనకు న్యాయమనితోచిన టర్నోవరును నిర్ణయించవలెను. శెక్షను 5 లేక 6 ప్రకారం విధింపబడిన, శెక్షను 9 (1) ప్రకారము ప్రకటింపబడిన పన్నురేట్ల ప్రకారము ఆవ్యాపారి చెల్లించవలసిన పన్నును తాత్కాలికముగా నిర్ణయించవలెను.

12. ఒక వ్యాపారిచేత రిటరన్ పంపబడకపోతే, పన్ను విధింపు అధికారి ఒక నోటీసును జారీచేసి, తనకు అవసరమనితోచిన విచారణ జరిపి, అట్టి

వ్యాపారికి, తనకు న్యాయమని తోచినరీతిగా పన్నువిధించవలెను. ఒక వ్యాపారి పంపిన రిటరన్ సరియైనది కాదనిగాని, పూర్తిగా లేదనిగాని పన్ను విధింపు అధికారి అభిప్రాయపడినచో, రిటరన్ సరిగానున్నదనియూ పూర్తిగా నున్నదనియూ రుజువు చేసుకునేందుకు అట్టి వ్యాపారికి న్యాయమైన అవకాశమును గలుగజేసి తనకు అవసరమనితోచిన యితర విచారణలు జరిపినతర్వాత తనకు న్యాయమని తోచినరీతిగా పన్నువిధింపు అధికారిపన్ను విధించవలెను.

12. రూలు 10 లేక 11 ప్రకారము తాత్కాలిక పన్ను విధింపుతో బాటుపన్ను విధింపు అధికారి ఆ వ్యాపారికి ఒక నోటీసును ఫారం 'బి' లో జారీ చేయవలెను. వ్యాపారస్తుడు తనకు తాత్కాలికముగా నిర్ణయింపబడిన సంవత్సరపుపన్ను మొత్తములో ప్రతినెలా 1/12 వ వంతు చొప్పున నోటీసులో వుదహరించినరీతిగా, నోటీసు యివ్వబడిన తేదీకి ముందుజరిగిన నెలలో చెల్లించవలసిన వాయిదాలతోసహా మొత్తము చెల్లించవలెను.

14. [1] శెక్షను 2 యొక్క (సి) క్లాజు క్రిందకు వచ్చు ప్రతి అవకాశవ్యాపారి (క్యాజువల్ ట్రేడరు) ఈ రాష్ట్రములోని ఏ ప్రాంతము నకైననూ వచ్చిన, 24 గంటలలోపల ఆ ప్రాంతపు పన్ను విధింపు అధికారికి తనరాక విషయమును తెలియపరచవలెను. తను ఏ సరకులలో వ్యాపారము చేయదలచినది, తన నివాసము, చిరునామా ఈ రాష్ట్రమును వదలి ఎప్పుడు వెళ్ళునది తెలియపరచవలెను.

(2) అవకాశ వ్యాపారి వ్యాపారముచేయు ప్రాంతమును వదలి వెళ్ళుటకు ముందుగా ఆ ప్రాంతపు పన్నువిధింపు అధికారికి ఫారం 'ఎ3'లో ఒక రిటరన్‌ను పంపవలెను. ఆ రిటరన్‌తో పాటుగా, రిటరన్ ఆధారముగా, శెక్షను 5 లేక 6 ప్రకారము విధింపబడిన, శెక్షను 9 (1) ప్రకారం ప్రకటింపబడిన పన్నులకు ట్రెజరీ రశీదును కూడా పంపవలెను. పన్ను విధింపు అధికారి తనకు అవసర మనితోచిన విచారణలు జరిపినమీదట ఆ రిటరన్ సరియైనదనియూ, పూర్తిగానున్నదనియూ తృప్తి పడినచో అట్టి వ్యాపారికి పన్ను విధించవలెను.

[3] అట్టి అవకాశ వ్యాపారిచేత 2 వ సబ్ శెక్షను ప్రకారము కోరబడిన రిటరన్ పంపబడకపోయిననూ, లేదా అట్టి పంపబడిన రిటరన్ సరియైనది కాదని గానీ పూర్తిగా లేదనిగాని పన్నువిధింపు అధికారి అభిప్రాయము పడిననూ, రూలు 12 లో యివ్వబడిన చర్యలు జరిపిన మీదట తనకు న్యాయమని తోచినరీతిగా చెల్లింపవలసిన పన్నును నిర్ణయించుచూ, యివ్వవలసిన పన్నుకు ఫారం "బి-4" లో ఒక డిమాండు నోటీసును

జారీచేయవలెను. ఆ నోటీసులో తెలుపబడిన విధముగా నిర్ణయింపబడిన కాలములోపల అవకాశ వ్యాపారి పన్నును చెల్లించవలెను.

15. (1) రూలు 8 లేక 9 ప్రకారం రిటరన్ పంపవలసిన ప్రతివ్యాపారి (రూలు 17 ప్రకారం పన్ను చెల్లింపును కోరుకొను వ్యాపారి మినహా) సంవత్సరము పూర్తియైన 30 రోజులలోపల, తన ప్రధాన కార్యస్థానముగల ప్రాంతపు పన్ను విధింపు అధికారికి గత సంవత్సరములో తనయొక్క అన్ని వ్యాపార ప్రాంతములలో జరిగిన మొత్తపు టర్నోవరును, నికర టర్నోవరునూ తెలుపుచూ ఫారం "ఎ-1"లో ఒక రిటరన్‌ను పంపవలెను.

(2) రూలు 10 లేక 11 ప్రకారం తాత్కాలికంగా పన్ను విధింపబడిన ఒక వ్యాపారి, ఆ సంవత్సరములో వ్యాపారమును చాలించు నెడల, తనకు సంబంధించిన పన్నువిధింపు అధికారి తన వ్యాపారమును నిలుపుచేయువరకు జరిగిన వ్యాపార మొత్తమును తెలుపుచూ, వ్యాపారము నిలుపుచేసిన 30 రోజుల లోపల ఒక రిటరన్‌ను ఫారం. "ఎ-1" లో పంపవలెను.

(3) పైన పేర్కొనబడిన 1,2 సబ్‌రూల్సు ప్రకారం రిటరన్‌లు పంప వలసిన ప్రతి వ్యాపారి, ఆ రిటరన్‌తోపాటు తను చెల్లించవలసిన పన్ను మొత్తమునకు తాత్కాలిక పన్నును ఏదైనా చెల్లించిన యెడల అట్టి మొత్తమును మినహాయించి, గవర్నమెంటు ట్రెజరీయొక్క రశీదునుగాని, పన్ను విధింపు అధికారిపేర క్రాస్ చేయబడిన చెక్కునుగాని జతపరచి పంపవలెను. వ్యాపారి అలాచేయనియడల పన్ను విధింపు అధికారి ఒక నోటీసును ఫారం "బి-1"లో వ్యాపారికి పంపవలెను. ఆనోటీసులో ఉదహరించ బడిన కాలములోపల ఉదహరించబడినరీతిగా ఆ వ్యాపారి పన్ను చెల్లించవలెను.

(4) ఫారం "ఎ-1" లో ఒక రిటరన్ అందిన తర్వాత లెక్కలను పరిశీలించి, తనకు అవసరమనితోచిన విచారణలు జరిపి, ఆ రిటరన్ సరియైన దనియూ, పూర్తిగా నున్నదనియూ, పన్నువిధింపు అధికారి అభిప్రాయ పడినచో. శెక్షను 5 లేక 6 క్రింద విధింపబడిన లేక శెక్షను 9 (1) క్రింద ప్రకటింపబడిన ప్రకారం చెల్లించవలసిన పన్నులకు ఫైనల్ ఎసెస్మెంటు చేయవలెను.

(5) రిటరన్ పంపబడకపోయిననూ లేక పంపబడిన రిటరన్ సరియైనది కాదనిగాని, పూర్తిగా లేదనిగాని పన్నువిధింపు అధికారి అభిప్రాయపడి నచో, రూలు 12 లో తెలిపిన చర్యలు జరిపిన తర్వాత, శెక్షను 5 లేక 6 క్రింద విధింపబడిన లేదా శెక్షను 9 (1) క్రింద ప్రకటింపబడిన ప్రకా

రం చెల్లించవలసిన పన్నులను తనకు న్యాయమని తోచినరీతిగా నిర్ణయించవలెను.

(6) ఒక వ్యాపారి తాత్కాలిక పన్నుక్రింద, ఆ సంవత్సరము నకు ఫారం "ఎ-1"లో రిటరన్‌ను పంపు సమయమున తను లోగడ చెల్లించిన మొత్తములను మినహాయించినప్పటికీ, సబ్‌రూలు 4 లేక 5 ప్రకారం ఫైనల్ అసెస్మెంటు జరిగినతర్వాత యింకనూ పన్ను బకాయిపడినచో పన్ను విధింపు అధికారి ఫారం "బి-3" లో ఒక నోటీసును జారీచేయవలెను. ఆ నోటీసులో డిమాండు చేయబడిన బకాయిపన్ను మొత్తమును, వ్యాపారి ఆ నోటీసులో తెలిపిన రీతిగా నిర్ణయించిన కాలములోపల చెల్లించవలెను. వ్యాపారికి ఏదేని పన్ను రిఫండును యివ్వవలసినచో, ఫారం "సి" లో ఒక నోటీసును పన్నువిధింపు అధికారి జారీచేయవలెను.

16 (1) సంవత్సరము పూర్తియైన 30 రోజులతర్వాత పన్నువిధింపు అధికారి—

(ఎ) రూలు 15 యొక్క 1 వ సబ్‌రూలుప్రకార ఒక వ్యాపారిచే పంపబడిన రిటరన్ ఆధారముగాగాని లేదా అట్టి రిటరన్ పంపబడక పోయిననూ, పంపబడిన రిటరన్ సరియైనది కాదనిగాని, పూర్తిగాలేదనిగాని పన్ను విధింపు అధికారి అభిప్రాయపడినచో రూలు 12 లో తెలుపబడిన చర్యలు అమలు జరిపినతర్వాత తనకు న్యాయమని తోచినరీతిగా, పన్ను విధింపు అధికారి తాత్కాలికపన్ను విధించవలెను.

(బి) ఫారం "బి" ప్రకారం నోటీసును జారీ చేయవలెను. తాత్కాలిక పన్ను విధింపు నోటీసు అందేవరకూ వ్యాపారి గత సంవత్సరములో మాదిరిగానే పన్ను చెల్లించుచుండవలెను. అయితే, జరుగుచున్న సంవత్సరములో తాను పన్ను చెల్లించనవసరములేనిచో వైవిధముగా కట్టనవసరము లేదు. అట్టి విధముగా చెల్లించబడిన పన్ను, ఆ సంవత్సర తాత్కాలిక పన్నువిధింపు సందర్భమున సరిపుచ్చబడవలయును.

(2) రూలు 10 లేక 11 లేక 16 (1) ప్రకారం ఫారం "బి" లో తెలుపబడిన ప్రకారం తాత్కాలికపన్ను నిర్ణయించబడినపుడు, రూపాయి లోని భాగమును దగ్గర రూపాయగా సరిచేయవలెను.

17. పైన వివరింపబడిన రూల్సు ప్రకారం ఈరూలుయొక్క 2 వ సబ్‌రూలు ప్రకారం పన్ను విధింపుకు బదులుగా సంవత్సరమునకు 50 వేల రూపాయలకు మించి టర్నోవరుగల వ్యాపారస్థుల సందర్భములో వ్యాపారి ఎంచుకొను రీతిగా పన్ను విధింపును అమలు జరుపవలెను. ఈపద్ధతి ప్రకారం

ఒకసంవత్సరమునుంచి అమలును కోరుకొను వ్యాపారస్థుడు రూలు 8 లేక 9 ప్రకారం దాఖలుచేయు రిటరనుతో పాటుగాని, సంవత్సరము ప్రారంభ మైన 30 రోజుల లోపల తన ఉద్దేశ్యమును పన్నువిధింపు అధికారికి తెలియపరచవలెను. ఆ సంవత్సరములో యిట్టి పద్ధతికి ఎట్టి మార్పు అంగీ కరించబడదు. ఐతే 8 నుంచి 13 వరకు, 15, 16 రూల్సుప్రకారం పన్ను విధింపు ఒక వ్యాపారికి కష్టముగా నున్నదని, ఆ ప్రాంతపు కమ్మరిషియల్ టాక్సు ఆఫీసరు అభిప్రాయపడితే, సంవత్సరము ప్రారంభమైన 3 నెలల లోపల పన్ను విధింపు పద్ధతిని మార్చవచ్చును.

(2) సబ్ రూలు 1కి లోబడి, ఒక వ్యాపారి ప్రతి నెల 25వ తారీఖు లోగా పన్నువిధింపు అధికారికి జేరునట్లుగా గతనెలలో తన మొత్తము టర్నోవరును, నికరటర్నోవరును తెలుపుచూ, ఫారం "ఎ-2" లో ఒక రిటరన్‌ను పంపవలెను. ఆరిటరన్‌తో పాటు శెక్షను 5లేక6 క్రిందవిధింపబడిన లేదా శెక్షను 9 (1) క్రింద ప్రకటింపబడిన ప్రకారం చెల్లించవలసిన పన్ను మొత్తమునకు గవర్నమెంటు ట్రెజరీయొక్క రశీదునుగాని, పన్నువిధింపు అధి కారి పేర క్రాస్ చేయబడిన చెక్కునుగాని జతపరచి పంపవలెను.

(3) అట్టి విధముగా పంపబడిన రిటరన్ సబ్ రూలు 4 ప్రకారం తాత్కాలికంగా అంగీకరించబడవలెను.

(4) ఒక నెలకు సంబధించిన రిటరన్ ఆ తర్వాత నెల 25 వ తేది లోపల పంపకపోయిననూ, లేదా అట్టి రిటరన్‌తో పాటు చెల్లించవలసిన పూర్తిపన్నుమొత్తమునకు ట్రెజరీ రశీదుగానీ, క్రాస్ చేయబడిన చెక్కును గానీ జతపరచి పంపకపోయిననూ లేదా అట్టి విధముగా పంపబడిన రిటరన్ సరియైనది కాదని, పూర్తిగాలేదనిపన్నువిధింపు అధికారి అభిప్రాయపడినచో రూలు 12 లో తెలిపిన చర్యలు అమలు జరిపిన పిమ్మట తనకు న్యాయ మనితోచిన రీతిగా టర్నోవరును నిర్ణయించవలెను. ఆ నెలకు చెల్లించవల సిన పన్నులను తాత్కాలికముగా విధించవలెను. ఆ వ్యాపారికి ఫారం "బి-2"లో ఒక నోటీసును జారీచేయవలెను. ఆ విధంగా నోటీసును అందు కున్న వ్యాపారి నోటీసులోని నిర్ణయింపబడిన తేదీలోపల పన్నును చెల్లించ వలెను.

(5) సబ్ రూలు (2) ప్రకారం పంపబడిన రిటరన్లకు సంబంధించిన సంవత్సరము పూర్తియైన తర్వాతగాని, లేక ఒక వ్యాపారి సంవత్సరము మధ్యలో తన వ్యాపారమును నిలుపుచేస్తే ఆ సంవత్సరములోగాని పన్ను విధింపు అధికారి వ్యాపారియొక్క లెక్కలను పరిశీలించి, తనకు అవసరమని తోచిన యితర విచారణలు జరిపినతర్వాత, అట్టి పంపబడిన రిటరన్లు సరియైన

వనియూ, పూర్తిగా వున్నవనియూ అభిప్రాయపడినచో, శెక్షను 5 లేక 6 క్రింద విధింపబడిన ప్రకారంగాని, లేక శెక్షను 9. I క్రింద ప్రకటింప బడిన ప్రకారంగాని ఆ వ్యాపారి చెల్లించవలసిన పన్ను మొత్తమును ఫైన లుగా విధించుచూ, ఒక ఉత్తర్వును జారీచేయవలెను.

(6) సబ్ రూలు 2 ప్రకారం కోరబడిన విధముగా ఒక వ్యాపారి రిటరన్‌ను పంపకపోయిననూ; అట్టి విధంగా పంపబడిన రిటరన్ సరియైనది కాదనినగాని, పూర్తిగా లేదనిగాని పన్ను విధింపు అధికారి అభిప్రాయ పడినచో, రూలు 12 లో తెలిపిన ప్రకారం చర్యలు జరిపిన తర్వాత, తనకు న్యాయమని తోచినరీతిగా టర్నోవరును నిర్ణయించుచూ, శెక్షను 5 లేక 6 క్రింద విధింపబడిన ప్రకారంగాని, లేక శెక్షను 9 (1) క్రింద ప్రకటింపబడిన ప్రకారంగాని వ్యాపారి చెల్లించవలసిన పన్ను మొత్తమును ఫైన లుగావిధించుచూ పన్నువిధింపు అధికారి ఒక ఉత్తరువును జారీచేయువలెను.

(7) సబ్ రూలు 5 ప్రకారము ఫైనలుగా నిర్ణయించబడిన పన్నును ఒక వ్యాపారి బకాయిపడినచో, రూలు 3 లేక 4 ప్రకారం చెల్లించిన తార్వాత; పన్నును మినహాయించి, పన్నువిధింపు అధికారి ఫారం "బి-3" లో ఒక నోటీసును వ్యాపారికి జారీచేయవలెను. ఆ నోటీసులో డిమాండు చేయబడిన మొత్తమును నిర్ణయించబడిన కాలములోపల ఆ వ్యాపారి చెల్లించవలెను. వ్యాపారికి ఏదైనా పన్నును రిఫండుచేయువలసి వచ్చినచో, పన్నువిధింపు అధికారి ఒక నోటీసును ఫారం "సి" లో వ్యాపారికి జారీ చేయవలెను.

18. పన్నువిధింపు అధికారి నిర్ణయించిన టర్నోవరును, యీ రూలున్న ప్రకారం వ్యాపారిచే దాఖలుచేయబడిన రిటరన్‌లోని టర్నోవరు రెంటి మొత్తాలకన్న, వేరుగాయున్నయెడల పన్నువిధింపు అధికారి తన ఆర్డరులో, అందుకు కారణములను క్లుప్తముగా వ్రాయవలెను. పన్ను విధింపు అధికారి వ్యాపారస్తునికి తన అసెస్మెంటు ఆర్డరు నకలును యివ్వవలయును. ఐతే ఈ రూలులో ఏమి వున్నప్పటికీ పన్ను విధింపుయొక్క న్యాయమును మార్పు కలుగచేయదు.

19. ఒక వ్యాపారి సరుకులను రొఖ్ఖముగా గాక, తదితరమైన విలువ గలప్రతిఫలమునకు అమ్మినా, కొన్నా ఈ రూలున్న ప్రకారం దాఖలు చేయబడిన రిటరన్‌లో ప్రత్యేకముగా అట్టి కొనిన, లేక అమ్మిన సరుకుల మొత్తము (పరిమాణము) వాటి విలువగల ప్రతిఫలమును ఉదహరించ వలెను. పన్నువిధింపు అధికారి, ఈ చట్ట ప్రకారం చెల్లించవలసిన

పన్నును నిర్ణయించునపుడు అట్టి సరుకుల ప్రతిఫలమును ధనరూపమైన విలువకుమార్చి నిర్ణయించవలెను. అట్టి విధముగా నిర్ణయింపబడిన మొత్తము అప్పీలుకు లేదా రివిజనుకులోబడి, ఈ చట్ట ప్రకారము లేదా రూలు ప్రకారము నిర్ణయింపబడిన మొత్తం ఫైనలుగా ఎంచబడును.

20. ఒక మైనరుయొక్కగాని, అశక్తుడైన వ్యక్తియొక్కగాని ఆవ్యక్తి తరఫున వ్యాపారమునుగార్డియన్, ట్రస్టీలేక ఏజెంటుచేయు సందర్భములో అట్టిగార్డియన్, ట్రస్టీ, లేక ఏజెంటు టర్నోవరుకు ఈ రూల్సు ప్రకారం రిటర్నను పంపవలెను. మరియు శెక్షను 5 లేక 6 క్రింద విధింపబడిన ప్రకారంగాని, శెక్షను 9 (1) క్రింద ప్రకటింపబడిన ప్రకారంగాని చెల్లించవలసిన పన్నుకుగాని, అపరాధమునకుగాని, బాధ్యుడై యుండవలెను. పన్నును గాని, అపరాధము గాని చెల్లించవలెను.

21. పన్ను చెల్లించవలసిన వ్యాపారియొక్క ఎస్టేటు, దానిలోని విడిభాగము కోర్టు ఆఫ్ వార్డ్సు, ఎడ్మినిస్ట్రేటర్ జనరలు, లేక రిసీవరు లేక మేనేజరు (వ్యాపారం తరఫున వ్యాపారమును ఏ హోదాక్రింద చేయుచున్నప్పటికీ, అట్టివ్యక్తి కోర్టువారిఉత్తర్వుల ప్రకారం వారి అధీనములో నున్నచో పై తెలుపబడిన అధికారులు ఈ చట్టప్రకారము పంపవలసిన రిటర్నను పంపవలెను. శెక్షను 5 లేక 6 క్రిందవిధింపబడిన ప్రకారంగాని శెక్షను 9. (1) క్రింద ప్రకటింపబడిన ప్రకారంగాని పన్ను విధింపబడవలెను.అట్టివిధింపబడిన పన్నుగాని, అపరాధముగాని పైన తెలుపబడిన వారిపేర విధించి, వసూలు చేయవచ్చును.

22. ఒక వ్యాపారమును, ఒక ఫరం, హిందూసమిష్టి కుటుంబము లేక నడచుచున్న, లేక రద్దుచేయబడిన ఒక సంఘము పేరుతోగాని చేయుచూ, ఆ వ్యాపారమును నిలుపుచేసిననూ లేదా చాలించిననూ ఆసమయమునకు ఆ ఫరంలోనూ, హిందూ అన్ డివైడెడ్ ఫామిలీ లోనూ లేక సంఘము లోనూ భాగస్వామిగానున్న ప్రతివ్యక్తి ఈచట్టముయొక్క 5 లేక 6 శెక్షను క్రిందవిధింపబడిన ప్రకారంలేదా శెక్షను 9. (1) క్రింద ప్రకటింపబడిన ప్రకారం పన్నువిధింపుకు వేర్వేరుగాగాని, జాయింటుగాగాని చెల్లింపులకు బాధ్యులై యుండవలెను.

23. ఒక వ్యాపారి వ్యాపారము చేయుచూ, ఈ చట్టప్రకారము పన్ను చెల్లించవలసియుండి చనిపోయినచో, చనిపోయినవాని మరణశాసనము ప్రకారము అధికారముగలవాడు లేదా చనిపోయినవారి ఆస్తిపై అధికారము కలవాడు లేదా ఉత్తరాధికారి అను పేరుగలవాడు లేదా చనిపోయినవాని న్యాయానుసారమైన ప్రతినిధిగాని ఈ రూల్సు ప్రకారం

రిటర్న్లు పంపవలెను. శెక్షను 5 లేక 6 క్రింద విధింపబడిన ప్రకారం లేదా శెక్షను 9. (1) క్రింద ప్రకటింపబడిన ప్రకారం పన్ను విధింపబడవలెను. చనిపోయినవాని ఆస్తి నుండి, చనిపోయిన వ్యక్తి చెల్లించవలసిన పన్ను అపరాధను చెల్లించవలెను.

(2) ఈ రూల్సును సంబంధించిన అప్పీళ్ళు, రివిజన్లు 1 వ సబ్ రూలు ప్రకారం విధింపబడిన పన్నులకు, మరణశాసనము ప్రకారం అధికారముగల వాడు, చనిపోయినవాని ఆస్తిపై అధికారముగలవాడు, ఉత్తరాధికారి అను పేరు గలవాడు, లేక చనిపోయినవాని న్యాయానుసారమైన ప్రతినిధి, తనే వ్యాపారి అయినట్లుగా చేయవచ్చును.

(3) 1 వ, 2 వ సబ్ రూల్సుకు సంబంధించినంతవరకు ఒక ఫరంలోని మానేజింగ్ పార్టనరు చనిపోయినచో మిగిలినవారు పై తెలిపిన హక్కులను ఉపయోగించుకొనవచ్చును.

24. ఒక వ్యాపారి శెక్షను 2 (యు) క్లాజులోని షరతులకు లోబడి, తనకు సంబంధించి వ్యాపార సంవత్సరమును మార్పుచేసినచో, వ్యాపారము పూర్తిచేసిన సంవత్సరమునకు మరల ప్రారంభించిన సంవత్సరమునకు మధ్య కాలమునకు శెక్షను 5 లేక 6 క్రింద విధింపబడిన ప్రకారము లేక శెక్షను 9 (1) క్రింద విధింపబడిన ప్రకారం చెల్లించవలసిన పన్ను నిర్ణయించినపుడు ఆ వ్యాపారియొక్క వ్యాపార సంవత్సరము లేక ఆర్థిక సంవత్సరముయొక్క టర్నోవరు ఆధారముగా పరిగణింపబడును.

అనుమతించబడిన మధ్యకాలమునకు ప్రత్యేకముగా పన్ను విధింపబడవలెను. 25 (1) ఒక వ్యాపారి కొన్న వేరుశనగకాయ, పప్పునుండి, వేరుశనగ నూనె లేక పిండి ఉత్పత్తిచేయుచో, పన్ను విధింపు అధికారికి దరఖాస్తుచేసుకొన్న మీదట వేరుశనగనూనె, పిండియొక్క రిజిష్టర్డు మాన్యుఫాక్చరర్ గా రిజిష్టర్డు చేయించుకొనవచ్చును.

2. అట్టి రిజిష్టరు కాబడిన ప్రతి ఉత్పత్తిదారుడు రూలు 6 సబ్ రూలు 1 లోని క్లాజు (కె) క్రింద, వేరుశనగకాయ లేదా పప్పుఖరీదుకు సమానమైన, తయారు కాబడిననూనె, పిండికి మినహాయింపుకు అర్హుడగును. ఐతేనూనె అమ్మకపు మొత్తము అతని టర్నోవరులో చేర్చి దానికగు పన్ను చెల్లించబడవలెను. ఐతేమినహాయింపుకు అంగీకరించబడిన టర్నోవరు లెక్కలలో బహిరంగము కాబడిన ఉత్పత్తిచేసి అమ్మిన వేరుశనగ నూనె ఉత్పత్తికై వినియోగించిననూ వేరుశనగకాయ పప్పుఖరీదు లేదా ఈ క్రింది తెలి

పీన ప్రకారము లెక్కకట్టిన మొత్తము ఏది తక్కువైనచో అది, ఈ అమ్మకము పై పన్ను కట్టబడియుండవలెను.

వివరణము:— ఈ సబ్ రూలుకు సంబంధించినంతవరకు—

(ఎ) 143 పౌనుల వేరుశనగకాయ 100 పౌనులు పప్పుకు సమానము.

(బి) 143 పౌనుల వేరుశనగకాయకు లేక 100 పౌనుల పప్పును, నూనెగా మార్చుచేసినచో సాధారణముగా 40 పౌనుల నూనె దిగుబడి అయినట్లుగా పరిగణింపబడును. మరియు

(సి) ఒక పుట్టి (కాండి) 500 పౌనుల వేరుశనగ నూనెకు సమానము.

3. సబ్‌రూలు 2 కు సంబంధించినంతవరకు ఉత్పత్తిదారుడు మినహాయింపును కోరు నెలలో ఖరీదుచేసిన వేరుశనగకాయ, లేదా పప్పు కొన్న ఖరీదు లేక ఆ నెలలో ఎట్టి కొనుగోలు జరగనిచో అతను ఆఖరిసారిగా కొనుగోలుచేసిన నెలకు ముందు నెలలో ఖరీదుచేసిన వేరుశగకాయ లేదా పప్పు కొనుగోలు ఖరీదు ప్రకారం లెక్కకట్టవలయును.

4. అట్టి ఉత్పత్తిదారుడు ప్రతి నెల 25వ తేదిలోపల పన్ను విధింపు అధికారికి చేరునట్లుగా గత నెలలో జరిగిన వ్యవహారమునకు ఒక దరఖాస్తును ఫారం "VIII" లో పంపవలెను.

5. ఒక వేరుశనగనూనె ఉత్పత్తిదారుడు సబ్‌రూలు (1) ప్రకారం రిజిష్టర్డు మాన్యుఫాక్చరర్‌గా రిజిష్టరు కాకపోయిననూ, సబ్‌రూలు (1) ప్రకారం రిజిష్టరు కాబడిన ఉత్పత్తిదారుడు సబ్ రూలు (4) ప్రకారం ఒక దరఖాస్తును ఫారం "VIII" లో 25 వ తేది తర్వాత పంపిననూ, లేక ఫారంలో కోరబడినవివరాలలో వేటినైన విడిచిపెట్టిన అప్రాంత కమర్షియల్ టాక్సు ఆఫీసరు తనకు అవసరమని తోచిన విచారణ జరిపిన తర్వాత అట్టి వదలిపెట్టబడినదానిని గాని లేక ఆలస్యమునుగాని లేక రెంటినిగాని క్షమించవచ్చును. ఐతే అట్టి ఉత్పత్తిదారుడు ఫారం "VIII"లో ఉదహరించిన వివరము లన్నింటిని తెల్పుచూ ఒక రిజిష్టరును నిర్వహించవలెను.

6. సబ్‌రూల్సు I నుంచి 5 వరకు గల నిబంధనలు శుద్ధిచేయబడిన వేరుశనగ నూనెకు వర్తించవు.

7. రూలు యొక్క 1 వ సబ్ రూలులోని (ఇ) క్లాజుప్రకారం యివ్వబడిన మినహాయింపు వేరుశనగపిండి అమ్మకమునకు వర్తించదు.

26. చుట్టలు, చెరూట్సు, నశ్యము, ఉత్పత్తిదారులు వాటిలో మాత్రమే వ్యాపారముచేయుచూ, సంవత్సరటర్నోవరు 1200 రూపాయలకు మించినచో, అట్టి ఉత్పత్తిదారుడు రూలు 6 యొక్క 1 క్లాజుప్రకారం చెరూట్సు, చుట్టలు, నశ్యము ఉత్పత్తికై ఉపయోగించిన పొగాకు ఎంత కొంటాడో అంత కొనుగోలుధరకు మొత్తమునకు మినహాయింపుకు అర్హుడై యుండవలెను. ఐతే అట్టి కొనుగోలుధర మొత్తపు టర్నోవరులో జేర్చబడి, పన్ను చెల్లించవలెను.

27. ఒక వ్యాపారి ఈ చట్టప్రకారం వివిధ రేట్లకు సంబంధించిన సరుకులలో వ్యాపారముచేయుచో, అతను దాఖలుచేయు రిటర్నలో అట్టి ప్రతి తరగతి సరుకులను ప్రత్యేకముగా చూపవలెను.

## రిజిస్ట్రేషను

28. (1) ఈ చట్టము అమలులోనికి రాకపూర్వము వ్యాపారము చేయుచూ, గత సంవత్సరములో 7, 500 రూ. లకు తక్కువకాని టర్నోవరుగల ప్రతి వ్యాపారి; టర్నోవరుతో నిమిత్తము లేకుండా, ఇచ్చట నివసించని యజమానియొక్క ప్రతి ఏజెంటూ, ఆంధ్రప్రదేశ్ గెజెట్టులో ఈ రూల్సు ప్రకటింపబడిన 30 రోజులలోపల రిజిస్టరింగు అధికారికి రిజిస్ట్రేషనుకై ఒక దరఖాస్తును పంపవలెను.

(2) టర్నోవరుతో నిమిత్తము లేకుండా ఇచ్చట నివసించని యజమాని యొక్క ప్రతి ఏజెంటూ మొదటి 12 నెలల టర్నోవరు 7, 500 రూపాయలకు తక్కువకాని (క్యాజుయల్ ట్రేడర్ గాక) ప్రతి వ్యాపారి, 1957 జూన్ 15 వ తేదీ తర్వాత వ్యాపారము ప్రారంభించినచో, వ్యాపారము ప్రారంభించిన 30 రోజుల లోపలగాని, టర్నోవరు 7, 500 రూపాయలు పూర్తియైన 30 రోజుల లోపలగాని రిజిస్టరింగు అధికారి రిజిస్ట్రేషనుకై ఒక దరఖాస్తును పంపవలెను.

(3) ఏవ్యాపారస్తుడైననూ సబ్ రూల్సు 1 లేక 2 ప్రకారం రిజిస్ట్రేషనుకై దరఖాస్తులు పంపనవసరము లేకపోయినప్పటికీ, తనకు వాంఛయున్నచో శెక్షను. 12 ప్రకారం రిజిస్ట్రేషనుకై రిజిస్టరింగు అధికారికి దరఖాస్తు చేయవచ్చును.

(4) సబ్ రూల్సు 1 లేక 3 ప్రకారం చేయబడు ప్రతి దరఖాస్తు ఫారం "డి"లో చేయవలెను.

5. రిజిస్ట్రేషను కై చేయబడు ప్రతిదరఖాస్తుతో పాటు, 6 రూపాయలు రిజిస్ట్రేషన్ ఫీజు క్రింద ట్రెజరీ రశీదుగాని, రిజిస్ట్రేషన్ అధికారి పేర క్రాస్ చేయబడిన చెక్కు గాని జతపరచవలెను.

ఐతే, 1939 వ సం॥ మద్రాసు సాధారణ అమ్మకపుపన్ను చట్టప్రకారంగాని, 1950 వ సం॥ హైదరాబాదు సాధారణ అమ్మకపు పన్ను చట్టి ప్రకారంగాని, 1956 వ సం॥ ఆంధ్రప్రదేశ్ సాధారణకొనుగోలుపన్నుచట్టి ప్రకారంగాని, 1957 - 58 సంవత్సరమునకు రిజిస్ట్రేషను లేక రెన్యూయల్ ఫీజు 6 రూపాయలు చెల్లించబడినచో, అట్టిఫీజు ఈ చట్టప్రకారం 1957-58 సంవత్సరమునకు రెన్యూయల్ లేక రిజిస్ట్రేషన్ ఫీజుగా పరిగణింపబడుతుంది.

(6) దరఖాస్తును అందుకున్న రిజిస్టరింగు అధికారి నిర్ణయించబడిన ఫీజు చెల్లించబడిందని తృప్తిపడినచో ఫారం "డి-1" లో ఒక రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్టును యివ్వవలెను.

(7) ఒక వ్యాపారి ఒకటికంటె ఎక్కువ వ్యాపారస్థలములను కలిగి యున్నచో, రిజిస్ట్రేషన్ సర్టిఫికెటు ఆ వ్యాపారియొక్క అన్ని వ్యాపారస్థలములకు వర్తించును.

(8) కాజుయల్ ట్రేడర్ కాని ప్రతి రిజిష్టర్డు వ్యాపారి, అతని రిజిస్ట్రేషను. రద్దు చేయబడువరకు, సబ్ రూలు 5 ప్రకారం నిర్ణయింపబడిన 6 రూపాయల ఫీజును, తర్వాత ప్రతి సంవత్సరమునకు రిజిస్ట్రేషన్ రెన్యూ చేయబడవలసిన 30 రోజుల లోపల చెల్లించవలెను.

(9) ఇవ్వబడిన రిజిస్ట్రేషన్ సర్టిఫికెటు పోయిననూ, ప్రమాదకారణంగా చెడిపోయిననూ, 50 నయాపైసాల ఫీజును చెల్లించిన మీదట ఒక డూప్లికేటు రిజిస్ట్రేషను సర్టిఫికెటును రిజిష్టరింగు అధికారి యివ్వవచ్చును. అట్టి మొత్తమును ట్రెజరీలోగాని, రిజిష్టరింగు అధికారిపేర క్రాస్ చేయబడిన చెక్కుద్వారా గాని చెల్లించవలెను.

(10) ఇవ్వబడిన లేక రెన్యూ చేయబడిన రిజిస్ట్రేషను సర్టిఫికెటు అమ్మకూడదు. లేదా ట్రాన్సుఫర్ చేయకూడదు.

(11) రిజిస్ట్రేషను సర్టిఫికెటుగల ఒక వ్యాపారి తన వ్యాపారము మరియొకనికి మార్చినచో, మార్పు పొందిన వ్యాపారి నిర్ణయించబడిన ఫీజును చెల్లించి క్రొత్త రిజిస్ట్రేషన్ సర్టిఫికెటును పొందవచ్చును.

(12) రిజిస్ట్రేషన్ సర్టిఫికెటుగల ప్రతి వ్యాపారి, తన వ్యాపార స్థలములో స్ఫుటముగా కనబడెడుచోట రిజిస్ట్రేషను సర్టిఫికెటును కనబరచవలెను.

(13) ఈ చట్టప్రకారం చెల్లించవలసిన పన్నులన్నింటినీ వ్యాపారి చెల్లించినాడని తృప్తిపడుటకుగాను, రిజిస్టరింగు అధికారి ఒక వ్యాపారి యొక్క లెక్కలను తిరిగి తెప్పించి పరీక్షించవచ్చును.

(14) రిజిస్టరు కాబడిన ఒకవ్యాపారి తన వ్యాపార స్థలమును మార్చినచో, అట్లుమార్చిన తేదీనుండి 15 రోజుల లోపల రిజిష్టరింగు అధికారికి ఆ విషయమును తెలియజేసి, ఆ విధముగా రిజిస్ట్రేషన్ సర్టిఫికెటును మార్పు చేయించుకోవలెను.

(15) రిజిస్టరుకాబడిన ఒక వ్యాపారి ఉమ్మడి వ్యాపారములో చేరినచో, అట్టి ఉమ్మడివ్యాపారసంస్థ కొత్త రిజిస్ట్రేషన్‌ను సర్టిఫికెటుకై వ్యాపారము ప్రారంభించిన 30 రోజులలో దరఖాస్తు చేయవలెను.

(16) రిజిస్ట్రేషను సర్టిఫికెటులో ఉదహరించబడిన ఏ గోడౌను లోనూ, ఒక వ్యాపారి తన సరుకులను ఉంచకూడదు.

29. రూలు 28లో తెలిపిన విషయాలకు ఎట్టి హాని కలుగని విధంగా 2, 3, 4, షెడ్యూళ్ళలో నుదహరించిన సరుకులలో వ్యాపారము చేయు వ్యాపారస్తులకు, యీ క్రింద తెలిపిన విషయాలు అమలునందుండును.

1. షెడ్యూల్సు 2, 3, 4 లో ఉదహరించిన సరుకులలో వ్యాపారముచేయు ప్రతి వ్యాపారి, ఈ చట్టము అమలులోనికి రాకపూర్వము వ్యాపారము చేయుచుండినచో, టర్నోవరుతో నిమిత్తము లేకుండా, ఈ రూల్సు గెజెట్టులో ప్రకటింపబడిన 30 రోజుల లోపల తనయొక్క ప్రతి వ్యాపారస్థలమునకు (కేవలము సరుకుల నిల్వకు ఉపయోగించు స్థలము గాక) రిజిస్ట్రేషన్ సర్టిఫికెటుకై రిజిష్టరింగు అధికారికి దరఖాస్తుచేయవలెను.

2 షెడ్యూల్సు 2, 3, 4 లలో ఉదహరించిన సరుకులలో వ్యాపారమును 1957 జూన్ 15 వ తేదీ తర్వాత ప్రారంభించే ప్రతి వ్యాపారస్తుడు, తన టర్నోవరుతో నిమిత్తము లేకుండా, వ్యాపారమును ప్రారంభించిన 30 రోజులలోపల తనయొక్క ప్రతి వ్యాపార స్థలమునకు (కేవలము సరుకునిల్వకై ఉపయోగించు స్థలముమినహా) రిజిస్ట్రేషను సర్టిఫికెటుకై రిజిష్టరింగు అధికారికి దరఖాస్తు చేయవలెను.

3. సబ్ రూల్సు 1 మరియు, 2 ప్రకారం చేయబడు ప్రతి దరఖాస్తు ఫారం "డి" లో చేయవలెను.

4. ప్రతి రిజిస్ట్రేషను సర్టిఫికేటు ఒక్క వ్యాపార స్థలమునకు మాత్రమే వర్తించును. (కేవలము సరుకునిల్వకు ఉపయోగించు స్థలముమినహా)

5. ఒక వ్యాపారి ఒకటికంటె ఎక్కువ వ్యాపారస్థలములను కలిగి యున్నచో (కేవలము సరుకుల నిల్వకు ఉపయోగించని స్థలము మినహా) అట్టి అన్ని స్థలములకు కలిపి ఒకే దరఖాస్తు చేయవచ్చును.

6. ప్రతి వాపారస్థలమునకు (కేవలము సరుకునిల్వకు ఉపయోగించు స్థలము మినహా) రిజిస్ట్రేషను ఫీజు 6 రూపాయలు దరఖాస్తుతో పాటుగా చెల్లించవలసిన రిజిస్ట్రేషను ఫీజుకు ట్రెజరీ రశీదుగాని, రిజిస్టరింగు అధికారి పేర క్రాస్ చేయబడిన చెక్కుగాని జతపరచవలెను.

7. రిజిస్టరింగు అధికారి ఒక రిజిస్ట్రేషనుకై దరఖాస్తుచేసిన ఒక దరఖాస్తుదారునిగాని, రిజిస్టరుకాబడిన ఒక వ్యాపారినిగాని, ఆవ్యాపారి అసంవత్సరమునకు చెల్లించవలసిన పన్ను మొత్తములో రిజిస్టరింగు అధికారిఅంచనా వేసిన మొత్తమునకు సగమును మించని మొత్తమును, పన్ను సక్రమముగా చెల్లించుటకై సెక్యూరిటీగా గవర్నమెంటు ట్రెజరీలో డిపాజిటు చేయవలసిందిగా కోరవచ్చును.

(8) సబ్ రూలు 7 లో ఉదహరించిన సెక్యూరిటీ డిపాజిటుకు బదులుగా మరేదైనా ఇతర సెక్యూరిటీ డిపాజిట్టుకు తగినదనియూ, చాలినదనియూ రిజిస్టరింగు అధికారి తలచినచో, అట్టిదానిని అంగీకరించ వచ్చును.

(9) దరఖాస్తును అందుకున్న రిజిస్టరింగు అధికారి నియమించబడిన ఫీజు చెల్లించబడినదనియూ, డిమాండు చేయబడిన సెక్యూరిటీ ఏదైనా ఉన్నచో, అట్టి సెక్యూరిటీకూడా యివ్వబడినదనియూ తృప్తిచెందినచో, ఫారం "డి-I" లో ఒక రిజిస్ట్రేషను సర్టిఫికేటును యివ్వవలెను.

(10) రిజిస్ట్రేషను సర్టిఫికేటు అమలులో ఉన్నంతకాలమూ, ఇవ్వబడిన సెక్యూరిటీని అటులనే వుంచవచ్చును. మరియు, ఏదైనా పన్ను బకాయిపడినచో; అట్టి బకాయి పన్నుకుగాను వ్యాపారికి తెలియజేసిన తర్వాత పై సెక్యూరిటీ డిపాజిటునుండి సరిపుచ్చవచ్చును.

(11) ఒక వ్యాపారియొక్క రిజిస్ట్రేషను సర్టిఫికేటును రద్దుచేయదలుచుకున్న అధికారి యిచ్చు ప్రతి ఉత్తర్వు వ్రాతరూపములో ఉండవలెను.

రిజిస్ట్రేషను సర్టిఫికెటుగల వ్యాపారి, సర్టిఫికెటు రద్దు చేయకుండా వుండు టకు కారణములు ఏమైనా వుంటే, అతడు చెప్పుకునేందుకు పూర్తి అవ కాశమును యివ్వవలెను. తరువాత ఉత్తర్వు జారీచేస్తూ, దాని కాపీని సర్టిఫికెటుగల వ్యాపారికి పంపవలెను.

## లైసెన్సులు

30. (1) ఒక వ్యక్తి తెలియబరచిన యజమానుల తరఫున అంగీకరించ బడిన కమీషనుకు గాని రుసుముకు గాని, కొన్ననూ లేదా అమ్మిననూ, సర ఫరాచేసిననూ పంచిననూ సెక్షను 11 లో ఇవ్వబడిన మినహాయింపును కోరు కొన్నచో, తన యొక్క ప్రతి వ్యాపార స్థలమునకు లైసెన్సుకై సబ్ రూలు (3) లో ఉదహరించిన అధికారికి, వ్యాపారసంవత్సరము ప్రారంభింపబడిన 30 రోజులలోపల ఫారం "డి-2" లో ఒక దరఖాస్తును చేయవలెను. ఐతే ఒక వ్యాపారి వ్యాపారము ఒకసంవత్సర మధ్యకాలములో ప్రారంభింప బడినచో ఆ వ్యాపారి వ్యాపారము ప్రారంభించిన రోజును, 30 రోజులకు మించకుండా లైసెన్సుకై దరఖాస్తును అట్టి అధికారికి పంపవలెను.

(2) ప్రతి లైసెన్సు ఒక వ్యాపారప్రదేశమునకు మాత్రమే వర్తించును. అట్టి లైసెన్సు, యివ్వబడిన సంవత్సరము యొక్క ఆఖరురోజుతో ముగి యును. కాని లైసెన్సుగల వ్యాపారినుంచి దరఖాస్తు వచ్చినచో సంవత్సర కాలమునకు మించని కాలమునకు రెన్యూ చేయవచ్చును.

(3) లైసెన్సు రెన్యూయలుకై చేయబడు ప్రతి దరఖాస్తు ఫారం "డి-2" లో, రెన్యూ చేయుటకు కోరబడిన సంవత్సర ప్రారంభమునుండి 30 రోజులలోపల చేయవలెను.

(4) లైసెన్సుకై గాని రెన్యూయలుకై గాని చేయబడు ప్రతి దరఖాస్తు అందుకై నిర్ణయింపబడిన తేదీ తర్వాత అందుచే అట్టి దరఖాస్తుపై సాధా రణముగా లైసెన్సులు యివ్వకూడదు. లేదా రెన్యూయలు చేయకూడదు. అట్టి లైసెన్సుయివ్వబడిన లేక రెన్యూచేయబడిన సంవత్సరము ఆఖరు తేదీ ముగియును. ఐతే ఆ ప్రాంత కమర్షియల్ టాక్సు ఆఫీసరు ఏదైనా ఒక అర్హతకలిగియున్న దృష్టాంతములో లైసెన్సుకై లేక రెన్యూయలుకై వచ్చిన దరఖాస్తు నిర్ణయింపబడిన తేదీకి తర్వాత అందిననూ దానిని అంగీకరింప వచ్చును. లేక అంగీకరింప వలసిందిగా లైసెన్సింగు అధికారికి ఆజ్ఞాపింప వచ్చును. కమర్షియల్ టాక్సు ఆఫీసరు పెనాల్టీగా తనకుతోచిన మొత్త మునూ (లైసెన్సు ఫీజుకంటె 9 రెట్లకు మించనిది) మామూలుగా చెల్లించని

మొత్తమునుకూడా దరఖాస్తుదారుడు చెల్లించిన మీదట వెనుకనుంచి అమలులో నున్నట్లుగా లైసెన్సు యివ్వవచ్చును.

(5) ఒక 1,000 రూపాయలకు మించకుండా లైసెన్సు లేక రెన్యూయల్ ఫీజు ఈ క్రింది విధముగా ఉండును.

(i) వ్యాపార మొత్తము 25,000 రూపాయలకు మించనిచో — 50 రూపాయలు.

(ii) వ్యాపార మొత్తము 25,000 రూపాయలకు మించి 50,000 లోపు అయినచో — 100 రూపాయలు

(iii) వ్యాపార మొత్తము 50,000 రూపాయలకు మించి, లక్ష రూపాయలలోపు అయినచో — రు 200

మరియు తరువాత చేరిన ప్రతి లక్ష రూపాయల టర్నోవరుకు, లేక దాని భాగమునకు 100 రూపాయలు.

ఐతే 1939 సం॥ మద్రాసు సాధారణ అమ్మకపు పన్ను చట్టప్రకారంగాని, 1950 హైదరాబాదు అమ్మకపుపన్ను చట్ట ప్రకారంగాని, లైసెన్సు ఫీజు ఏదైనా ఉన్నచో దానిని 1957-58 సంవత్సరమునకు చెల్లించినచో, అట్టి ఫీజును ఈ చట్ట ప్రకారం ఈ సంవత్సరమునకు చెల్లించవలసిన మొత్తమునకు సరిచేయవలెను.

(6) పై 5వ సబ్ క్లాజులో ఉదహరించిన లైసెన్సు ఫీజు, ఉజ్జాయింపు టర్నోవరుపై లైసెన్సు లేక రెన్యూయల్ కై చేయబడు దరఖాస్తుతో పాటుగా చెల్లించవలెను. అట్టి విధముగా చెల్లించబడిన ఫీజు తాత్కాలికమే. ఈ రూల్సులో పేర్కొనటడిన విధముగా రివిజనుకుగాని లేదా సరిచేయుటకుగాని అనుమతింపబడవలెను.

(7) లైసెన్సుకొరకు లేదా రెన్యూయలుకొరకు దరఖాస్తుచేయు ప్రతి దరఖాస్తుదారుడూ, తన దరఖాస్తుతోపాటుగా నిర్ణయింపబడిన లైసెన్సు ఫీజు మొత్తమునకు ట్రెజరీ రశీదుగాని, అధికారిపేర క్రాస్ చేయబడిన చెక్కునుగాని జతపరచవలెను.

(8) దరఖాస్తులో తెలుపబడిన సమాచారము సరియైనదనియూ, పూర్తిగా నున్నదనియూ, సరియైన ఫీజు చెల్లించబడినదనియూ, దరఖాస్తుదారుడు లైసెన్సుకు అర్హుడనియూ లైసెన్సింగు అధికారి అభిప్రాయపడి

నచో, ఫారం "డి-3" లో ఒక లైసెన్సు యివ్వవచ్చును లేదా రెన్యూ చేయవచ్చును.

(9) దరఖాస్తులో తెలుపబడిన సమాచారము సరియైనది కాదనిగాని, పూర్తిగా లేదనిగాని, సరియైన ఫీజు చెల్లించబడలేదనిగాని, లైసెన్సింగు అధికారి అభిప్రాయపడినచో, తనకు అవసరమనితోచిన విచారణ జరిపి, దరఖాస్తుదారుడు ఏమైనా తెలుపదలచుకున్న యెడల, అట్టి సమాచారములను పూర్తిగా తెలుసుకొని యితర విధముగా రుజువుచేసుకునే అవకాశమును దరఖాస్తుదారునకు యిచ్చిన తరువాత తనకు న్యాయమని తోచినరీతిగా అంచనా టన్నేవరకు లైసెన్సింగు అధికారి నిర్ణయించవచ్చును. సబ్ రూలు 5 లోని టేబిలు ప్రకారం చెల్లించవలసిన లైసెన్సు ఫీజును విధింపవచ్చును. ఫారం "బి-5" లో దరఖాస్తుదారునకు ఒక నోటీసును జారీచేయవలెను. నోటీసులో తెలుపబడిన రీతిగా నిర్ణయింపబడిన కాలములోపల, నోటీసులో డిమాండు చేయబడిన మొత్తమును దరఖాస్తుదారు చెల్లించవలెను. నోటీసులో డిమాండుచేసిన మొత్తమును దరఖాస్తుదారు చెల్లించినమీదట; లైసెన్సుకై దరఖాస్తుచేసిన దరఖాస్తుదారుడు అందుకర్హుడని లైసెన్సింగు అధికారి అభిప్రాయపడినచో, దరఖాస్తు అందిన తరువాత లైసెన్సు ఇవ్వవచ్చును. లేదా రెన్యూ చేయవచ్చును—ఫారం "డి-3" లో అది ఉండవలెను. దరఖాస్తు అందిన తేదీ నుండి అమలులోనుండును.

(10) ఈ రూల్సు ప్రకారం ఇవ్వబడిన లైసెన్సు లేక రెన్యూచేయబడిన ప్రతి లైసెన్సు, లైసెన్సుదారునికి సంవత్సరమునకు యిచ్చినట్లుగా పరిగణింపబడును. లైసెన్సు అమ్మకూడదు లేదా ట్రాన్సుఫర్ చేయకూడదు

(11) ఒక లైసెన్సుదారుడు తన వ్యాపారమును మరియొకని పేర ట్రాన్స్‌ఫర్ చేసినచో, మార్పుచేయబడిన వ్యక్తి ఈ రూల్సు ప్రకారం క్రొత్త లైసెన్సుకై దరఖాస్తు చేయవలెను. అయితే మొదటి దరఖాస్తులో మిగిలిన కాలమునకు ఫీజు లేకుండా రెన్యూచేయవచ్చును.

(12) ఈ రూల్సు ప్రకారం యివ్వబడిన ఒక లైసెన్సు పోయిననూ, ప్రమాదకారణముగా నశించినను ఒక రూపాయి చెల్లించినచో నకలు లైసెన్సును లైసెన్సింగు అధికారి యివ్వవచ్చు.

(13) శెక్షను 11 ప్రకారం ప్రతి లైసెన్సుదారుడూ లైసెన్సు యివ్వబడిన సంవత్సర అంతమునకు 30 రోజులు ముందుగా ఫారం VII లో ఒక రిటరన్‌ను లైసెన్సింగు అధికారికి పంపవలెను. ఐతే ఈ సబ్ రూలు ప్రకారం రిటరను పంపవలసిన ఒక లైసెన్సుదారుడు, సంవత్సర మధ్యకాల ము

వ్యాపారమును మానివేసినచో, అట్లుమానివేసిన 30 రోజులలోపల మానివేసిన రోజుతోసహా ఆకాలమునకు ఫారం VII లో ఒక రిటరన్‌ను పంపవలెను.

(14) ఫారం VII లో ఒక రిటరన్ అందినమీదట, లైసెన్సుదారుని లెక్కలను తనిఖీచేసి, తనకు అవసరమనితోచిన యితర విచారణలు జరిపి, ఆ రిటరన్ సరిగానున్నదనియూ, పూర్తిగా నున్నదనియూ లైసెన్సింగు అధికారి అభిప్రాయపడినచో, రిటరన్ ఆధారముగా లైసెన్సు యివ్వబడిన వ్యవహారములకు సంబంధించిన టర్నోవరును నిర్ణయింపవచ్చును. సబ్‌రూలు (5) లోని ప్రకారం ఆ సంవత్సరమునకు ఆ లైసెన్సుదారుడు చెల్లించవలసిన లైసెన్సు ఫీజును ఫైనలుగా విధింపవచ్చును.

(15) రిటరన్ పంపబడకపోయినూ, పంపబడిన రిటరన్ పూర్తిగా లేదనిగానీ, సరిగా లేదనిగాని లైసెన్సింగు అధికారి అభిప్రాయపడితే, రూలు 12 లో తెలుపబడిన చర్యలు అమలు జరిపి, లైసెన్సుకొరకు యివ్వబడిన వ్యాపారమునకు సంబంధించిన టర్నోవరును లైసెన్సింగు అధికారి నిర్ణయింపవచ్చును. సబ్‌రూలు 5 లో తెలుపబడిన స్కేలు ప్రకారం ఆ సంవత్సరమునకు ఆ లైసెన్సుదారుడు చెల్లించవలసిన లైసెన్సు ఫీజును ఫైనలుగా విధింపవచ్చును.

(16) ఈ సబ్‌రూలు ప్రకారం ఫైనలుగా విధింపబడిన లైసెన్సు ఫీజు మొత్తము సబ్‌రూలు 7 లేక 9 ప్రకారం తాత్కాలికంగా చెల్లింపబడిన మొత్తముకంటె ఎక్కువగానున్నచో, ఫారం "బి.6" లో ఒక డిమాండు నోటీసును లైసెన్సింగు అధికారి లైసెన్సుదారునికి జారీచేయవలెను.

లైసెన్సుదారుడు నోటీసులో తెలుపబడినరీతిగా, నిర్ణయింపబడిన కాలములోపల డిమాండు చేయబడిన మొత్తమును చెల్లించవలెను. ఫైనలుగా విధించబడిన లైసెన్సుఫీజు మొత్తము, సబ్‌రూలు 7 లేక 9 ప్రకారం తాత్కాలికముగా చెల్లించబడిన లైసెన్సుఫీజు మొత్తముకంటె తక్కువగా నున్నచో, లైసెన్సింగు అధికారి ఫారం "సి" లో ఒక నోటీసును జారీ చేయవలెను.

**31.** (1) ఏ కారణమువల్లనైనా ఒక వ్యాపారస్తునియొక్క లేదా లైసెన్సు దారునియొక్క వ్యాపారటర్నోవరు లేదా అందులోని ఏ భాగమైననూ, ఏ సంవత్సరములోనైననూ పన్ను విధింపునుంచి తప్పించుకొన్నా, తక్కువ పన్ను విధింపబడినా లేదా ఏ సంవత్సరములోనైననూ లైసెన్సును తప్పించుకోబడినా, సబ్‌రూలు 6 యొక్క నిబంధలకు లోబడి, ఆ పన్ను

లేక లైసెన్సుకు సంబంధించిన సంవత్సరమునకు తర్వాత నాలుగు సంవత్సరములలోపల ఎప్పుడైననూ పన్ను విధింపు అధికారి లేక లైసెన్సింగు అధికారి వ్యాపారస్తునికి లేదా లైసెన్సుదారునికి ఒక నోటీసు జారీచేసి, అవసరమనితోచిన యితర విచారణలు జరిపి, తనకు న్యాయమని తోచిన రీతిగా సరైన టర్నోవరును నిర్ణయించి, వ్యాపారి చెల్లించవలసిన పన్నును లేదా లైసెన్సు ఫీజును నిర్ణయించి విధింపవచ్చును.

(2) 50 వేల రూపాయలకులోపు టర్నోవరుపై పన్ను విధింపబడిన తర్వాత, టర్నోవరులోని కొంత భాగము పన్నువిధింపునుండి తప్పించుకొనబడినట్లు కనగొనబడితే, అట్టివిధముగా పన్నునుండి తప్పించుకోబడిన మొత్తమునుకూడా కలిపితే ఆ మొత్తము 50 వేల రూపాయలకు మించి, 5 లక్షల రూపాయలకు లోపుఅయితే, ఈ సబ్ రూలు ప్రకారం డిప్యూటీ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరుగారు పన్నువిధింపు అధికారిగా నుందురు.

(3) 50 వేల రూపాయల లోపు టర్నోవరుపైగాని లేదా 50 వేల రూపాయలకు మించి 5 లక్షల రూపాయల లోపు టర్నోవరుపైగాని పన్ను విధింపబడిన తర్వాత, ఏదైతే అది; టర్నోవరులోని కొంతభాగము పన్ను విధింపునుండి తప్పించుకొనబడినట్లు కనుగొనబడితే, యిట్టి విధముగా పన్ను నుండి తప్పించుకోబడిన మొత్తమునుకూడా కలిపిన మొత్తము 5లక్షల రూపాయలకు మించినచో, ఈ సబ్ రూలు ప్రకారం కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరుగారు పన్నువిధింపు అధికారిగా నుందురు.

(4) ఏ కారణముచేతనైనా పన్ను లేక లైసెన్సుఫీజు తక్కువ రేటుకు, ఏ సంవత్సరములోనైననూ విధింపబడినచో, పన్నువిధింపు అధికారి లేక లైసెన్సింగు అధికారి సబ్ రూలు 7 లోని నిబంధనలకు లోబడి, ఆ పన్ను లేక లైసెన్సుఫీజు లేక జరిమానాకు సంబంధించిన సంవత్సరము తర్వాత నాలుగు సంవత్సరముల లోపల, ఆ వ్యాపారస్తునికి లేదా లైసెన్సుదారునకు ఒక నోటీసును జారిచేసి, అవసరమనితోచిన యితర విచారణలు జరిపిన తర్వాత, పన్నువిధింపును లేక లైసెన్సుఫీజును మార్చవచ్చును.

(5) సబ్ రూల్సు 1 మరియు 4 ప్రకారం పన్నువిధింపు అధికారికి యివ్వబడిన అధికారము, సెక్షను 19 లో ఉదహరించిన అప్పిలేటు అధికారి చేత లేక సెక్షను 20 లో తెలుపబడిన రివైజింగు అధికారిచేతకూడా, సందర్భానుసారముగా పన్ను లేక లైసెన్సుఫీజుకు సంబంధించిన సంవత్సరము తర్వాత నాలుగు సంవత్సరముల లోపల అమలు పరచవచ్చును. ఐతే, అట్టి అధికారి, అందుకు సంబంధించిన వ్యాపారి చెప్పుకునేందుకు న్యాయమైన

అవకాశమును ఇచ్చిన పిమ్మటనే ఈ సబ్ రూలు ప్రకారం ఉత్తర్వులను జారీచేయవలెను.

(6) సబ్ రూలు 1 లో తెలుపబడిన టర్నోవరు లేక సబ్ రూలు 4 లో తెలుపబడిన పన్ను లేక లైసెన్సు ఫీజును సంబంధించినంతవరకు, సెక్షను 19 లేక 20 ప్రకారం ఒక ఆర్డరు ప్యాసుచేసిన యెడల పన్ను విధింపు అధికారి ఒక రిపోర్టును అప్పిలేటు లేక రివైజింగు అధికారికి పంపవలెను. అట్టి అప్పిలేటు, రివైజింగు అధికారి ఆ వ్యాపారస్థునికి చెప్పుకునేందుకు న్యాయమైన అవకాశము నిచ్చినమీదట తగిన ఉత్తర్వులను ప్యాసు చేయవలెను.

(7) సబ్ రూల్సు (1) (4) మరియు (6) ప్రకారము చేయబడిన ఉత్తర్వులు, లైసెన్సింగు అధికారి లేక పన్ను విధింపు అధికారి, అధికపన్ను, రుసుము అపరాధము ఉన్నయెడల మామూలు పన్నుమాదిరిగా వసూలు పరచవలయును.

32. రూలు 15 ప్రకారం పూర్వపు సంవత్సరమునకు ఫైనలుగా నిర్ణయింపబడిన టర్నోవరు ఆధారముగా తాత్కాలికముగా 16 వ రూలు ప్రకారం నిర్ణయించబడిన టర్నోవరు మొత్తముకంటే ఎక్కువ అయినా, తాత్కాలికముగా నిర్ణయింపబడిన పన్ను విధింపు తక్కువ టర్నోవరుపై తక్కువరేటు చొప్పున విధింపబడినా, పన్ను విధింపు అధికారి, వ్యాపారస్తునకు ఒక నోటీసును జారీచేసి, తనకు అవసరమనితోచిన యితర విచారణలను జరిపిన పిమ్మట తాత్కాలిక పన్ను విధింపును మార్పు చేయవచ్చును. అయితే, పూర్వపు సంవత్సర టర్నోవరు ఆధారముగా తాత్కాలిక పన్ను విధింపు ఎక్కువగా వేయబడినచో, వ్యాపారికి నోటీసును జారీచేయవలసిన అవసరము లేదు.

## అప్పీళ్ళు - రివిజన్లు

33. (1) ఈ యాక్టులోని నిబంధనల ప్రకారము అధికార్లచే రికార్డు చేయబడిన ప్రొసీడింగ్సు లేక జారీచేయబడిన ఉత్తర్వులమీద సెక్షన్ 19లోని నిబంధనలకు లోబడి ఏ వ్యక్తిఅయిననూ అట్టి ఆర్డరు లేక రికార్డు చేయబడిన ప్రొసీడింగ్సుమీద అప్పీలు చేసుకొనవచ్చును.

(i) అసిస్టెంటు కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు ఉత్తర్వులమీద కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు వద్ద.

(ii) డిప్యూటీ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు ఉత్తర్వులమీద డిప్యూటీ కమీషనరు ఆఫ్ కమ్మర్షియల్ టాక్సెస్ వారివద్ద.

(iii) కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు ఉత్తర్వులమీద డిప్యూటీ కమీషనరు ఆఫ్ కమ్మర్షియల్ టాక్సెస్ వారివద్ద. (అయితే 19 వ సెక్షను ప్రకారము అప్పిలేటు అధికారివద్దగాక)

అయితే బోర్డు ఆఫ్ రెవిన్యూవారు వారి యిష్టప్రకారము లేక దరఖాస్తు అందినా, వ్రాతమూలకముగ చూపబడిన కారణములపై ఒక కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరువద్ద విచారణలోనున్న అప్పీలును మరొక కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరుకు, ఒక డిప్యూటీ కమీషనరువద్ద నున్న అప్పీలును మరొక డిప్యూటీ కమీషనరువద్దకు మార్చవచ్చును.

అట్టి ట్రాన్సుఫరు ఉత్తర్వును అప్పీలు చేసినవానికి, ఆ ఉత్తర్వువల్ల ప్రయోజనము పొందు ప్రతి వ్యక్తికీ, ఎవరి ఉత్తర్వులకు ప్రతికూలముగా యీ అప్పీలు చేయబడినదో అట్టి పన్నువిధింపు అధికారికి, మరియు కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు లేదా కమ్మర్షియల్ టాక్సుల డిప్యూటీ కమీషనర్లకు (ఎవరికి సంబంధించినదో వారు) తెలియజేయబడవలయును.

(2) ప్రతి అప్పీలు ఫారం I లో ఉండవలెను. అందులో ఉదహరించిన మాదిరిగా పూర్తిచేయవలెను. మూడు రూపాయల విలువగల కోర్టుఫీజు స్టాంపులు అతికించవలెను.

(3) ఇట్టి అప్పీలు అప్పిలేటు అధికారికి రిజిష్టరుపోస్టులో పంపవచ్చును. లేదా అప్పీలు చేసుకొనువానిచేగాని అతని అధికారమును పొందిన ఏజెంటుచేగాని, ఒక లీగల్ ప్రాక్టీషనరుచేగాని అప్పిలేటు అథారిటీకి లేక అప్పిలేటు అథారిటీచేత నియమింపబడునట్టి అధికారి ఎదుట దాఖలు చేయవచ్చును.

(4) అప్పీలు చేసుకొనువానికి చెప్పుకొనేందుకు న్యాయమైన అవకాశమును యిచ్చి, సెక్షను 19 యొక్క 3 వ సబ్ సెక్షన్‌లో తెలుపబడిన ప్రకారము అప్పీలు అధికారులు ఉత్తర్వులను జారీచేయవలెను.

34. సెక్షను 19 లేక 20 ప్రకారం అప్పిలేటు లేక రివైజింగు అధికారులయొక్క ప్రతి ఉత్తరువు, అప్పీలు చేసుకొనినవారికి అట్టి ఉత్తర్వుచే ప్రయోజనము పొందువారికి, ఎవరి ఉత్తర్వులపై ఈ అప్పీలు చేయబడినదో అట్టి లైసెన్సింగు లేక పన్నువిధింపు అధికారికి పంపవలెను.

35. అప్పీలు లేక రివిజనుమీద జారీచేయబడిన ఉత్తర్వు ప్రకారము, లైసెన్సింగు, లేదా పన్నువిధింపు అధికారి పన్ను అధికముగా వసూలుచేయ బడినదని అప్పీలు అధికారులు నిర్ణయిస్తే అట్టి తేడామొత్తములు, రెండు మాస ములలోగా రిఫండు చేయవలెను. లేదా, తక్కువపన్ను వసూలు చేయబడిన దని నిర్ణయిస్తే, ఆ మొత్తమును లైసెన్సింగు, లేదా పన్నువిధింపు అధి కారులు, ఆయా మొత్తాలను పన్ను వసూలుచేసినట్లుగా వసూలు చేయవలెను.

36. పన్నువిధింపు అధికారిచేత నిర్ణయింపబడిన తాత్కాలికపు పన్ను మొత్తము వ్యాపారి న్యాయముగా చెల్లించవలసిన పన్ను మొత్తము కంటె తక్కువగా నున్నదని అప్పీలు అధికారులకు తోచినచో 20 సెక్షను ప్రకారము వ్యాపారస్థునికి ఒక నోటీసును ఇచ్చి, అవసరమనితోచిన యితర విచారణలు జరిపినతర్వాత, అప్పిలేటు లేక రివైజింగు అధికారి, ఆ వ్యాపారి చెల్లించవలసిన సరియైన పన్ను మొత్తమును నిర్ణయించవలెను.

37, ఒక అప్పీలు లేక రివిజను సందర్భములో నిర్ణయించబడిన పన్ను మొత్తము ప్రారంభపు పన్నువిధింపు అధికారియొక్క అధికారములను మించి నచో, అప్పిలేటు లేక రివైజింగు అధికారి ఆ పన్నువిధింపుయొక్క ఒరిజినల్ రికార్డులను, సరియగు పన్నువిధింపు అధికారికి ట్రాన్సుఫరు చేయవలెను. ఆ పన్నువిధింపు అధికారి బకాయిబడిన పన్నును, తనచే విధించబడిన పన్ను మాదిరిగానే వసూలుచేయుటకు అధికారము కలిగియుండును.

38. (1) (i) 21 సెక్షనుక్రింద చేసే ప్రతి అప్పీలు ఫారం II లో వుండాలి. నిర్ణయింపబడ్డ విధానంలో అప్పీలు దాఖలుచేయాలి. అట్టి దర ఖాస్తు పరిశీలింపబడాలి

(ii) ప్రతి అప్పీలుకు 4 కాపీలు వుండాలి. ఈ కాపీలతో బాటు ఏవుత్తరువుపై అప్పీలు చేయబడినదో, ఆ వుత్తరువుయొక్క నకళ్ళు (వీటిలో ఒకటి అసలు ఉత్తరువు అయివుండాలి) నాలుగు, పన్నువిధింపు ఉత్తరువు నకళ్ళు మూడింటితో కలిపి, అప్పీలు దాఖలుచేయాలి.

(iii) 100 రూపాయలకు మించక, 25 రూపాయలకు తగ్గక, తగాయి దాలోవున్న మొత్తానికి, నూటికి 1 వంతు చొప్పున లెక్కచేయబడి, ఫీజు కట్టిన ట్రెజరీ రశీదుతో బాటు అప్పీలు దాఖలు చేయాలి.

(2) 21 సెక్షనుకి వ సబ్ సెక్షను ప్రకారం దాఖలు చేసిన అప్పీలును' అప్పిలేట్ ట్రిబ్యూనలు ఖాయపర్చినట్లయితే, ఉచితమని భావించినప్పుడు కట్టిన ఫీజును పూర్తిగాగాని, కొంతభాగంగాని వాపసు చేయమని, అప్పిలేట్ ట్రిబ్యూనలు ఉత్తరువు జారీ చేయవచ్చు.

(3) 4 సెక్షను ప్రకారం అప్పిలేట్ ట్రిబ్యూనలు జారీచేసిన ప్రతి ఉత్తర్వు, 21 వ సెక్షను 8 సబ్ సెక్షనులో సూచించినవారికి, అదనంగా కమర్షియల్ టాక్సెస్ డిప్యూటీ కమిషనరుకు, సేల్సుటాక్సు అప్పిలేట్ ట్రిబ్యూనలు కోర్టులోని స్టేట్ రిప్రజంటేటివ్‌కు ప్రతిఉత్తర్వును పంపబడవలయును.

39. 21 సెక్షను ప్రకారం సేల్సుటాక్సు అప్పిలేటు ట్రిబ్యూనలు ఉత్తర్వు అందిన తేదీలగాయితూ, 90 రోజుల లోపల వ్యాపారస్తుడుగాని, లేక ప్రభుత్వప్రతినిధిగాని, అప్పిలేటు ట్రిబ్యూనలు యిచ్చినతీర్పు అన్యాయంగా వుందనిగాని, లేక ఒక న్యాయశాస్త్ర అంశాన్ని నిర్ణయించలేక పోయిందనిగాని తలచినయెడల హైకోర్టుకు పిటీషను దాఖలు చేసుకోవచ్చు.

40. సెక్షను 22 సబ్ సెక్షను 1 క్రింద హైకోర్టులో దాఖలు చేసే ప్రతి దరఖాస్తు ఫారం III లో వుండాలి. ఈ దరఖాస్తు నిర్ణయింపబడ్డ విధానంలో పరిశీలింపబడాలి.

అప్పిలేటు ట్రిబ్యూనలు యిచ్చిన ఉత్తర్వుయొక్క సర్టిఫైడ్ నకలు దరఖాస్తుతోబాటు దాఖలుచేయాలి. దరఖాస్తు వ్యాపారస్థుడు దాఖలుచేస్తే 100 రూపాయలు ఫీజుకట్టాలి.

41. సెక్షను 23 సబ్ సెక్షను 1 ప్రకారం హైకోర్టుకు దాఖలు చేసే ప్రతి అప్పీలు ఫారం IV లో నమోదు చేయాలి. ఈదరఖాస్తు నిర్ణయింపబడ్డ ఆ యా విధానంలో పరిశీలింపబడాలి. ఈ దరఖాస్తు ఉత్తర్వు అందిన 60 రోజులలోగా దాఖలు చేయాలి. రెవిన్యూబోర్డువారి ఉత్తర్వుయొక్క సర్టిఫైడ్ నకలుకూడా అప్పీలుతో దాఖలు చేయాలి. ఇందుతోబాటు 100 రూపాయల ఫీజు కట్టాలి.

42. సెక్షను 22 సబ్ సెక్షను 7 లేక 23వ సెక్షను 4 ప్రకారం హైకోర్టుకు రెవ్యూకోసం దాఖలు చేయబడ్డ ప్రతిదరఖాస్తు వరసగా, V లేక VI ఫారంలో నమోదు చేయబడాలి. ఈ దరఖాస్తు నిర్ణయింపబడ్డ విధానంలో పరిశీలింపబడాలి. ఉత్తర్వు అందిన సంవత్సరంలోపల దరఖాస్తు దాఖలు చేయాలి. వ్యాపారి దాఖలు చేస్తే, రు 100 ఫీజు కట్టాలి.

43. అప్పిలేట్ ట్రిబ్యూనలు లేక హైకోర్టుజారీచేసిన ప్రతిఉత్తర్వునకున్ను అప్పిలేటు ట్రిబ్యూనలు లేక హైకోర్టు యిచ్చిన అర్థ కారణమున్నూ, పన్ను విధించే అధికారి, తనకు ఆయా ఉత్తర్వు అందిన రెండునెలల లోపల అదనంగా వసూలుచేసిన మొత్తమును వడ్డీలేకుండా వాపసు చేయవలయును, ఇదేవిధంగా అదనంగా విధింపబడ్డ పన్నునుకూడా వసూలు చేయవలయును.

44. (1) సెక్షను 20 సబ్ సెక్షను 1 లో ఉదహరించిన అధికారాలకు తమక్రింద పనిచేసే అధికారవర్గాలు, ఉద్యోగులు లేక వ్యక్తులు, జారీచేసిన ఉత్తర్వులు లేక జరిపిన చర్యల సందర్భములో, కమ్మర్షియల్ టాక్సెస్ డిప్యూటీ కమీషనరు, కమ్మర్షియల్ టాక్సుఆఫీసరు చెలాయిస్తాడు.

(2) చట్టప్రకారం విధింపబడ్డ పన్ను సందర్భములో పైన పేర్కొన్న అధికారములు యిలా చలాయించబడతవి.

(i) పన్నువిధింపు ఉత్తర్వు వ్యాపారికి జారీచేసిన తేదీలగాయితూ, 3 సంవత్సరముల లోపల, కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరుచే మాత్రము.

(ii) పన్నువిధింపు ఉత్తర్వు వ్యాపారికి జారీచేసిన తేదీలగాయితూ, 4 సంవత్సరములలోపల, డిప్యూటీ కమీషనరు లేక బోర్డు ఆఫ్ రెవిన్యూ వారిచే మాత్రము; మరిన్నీ

(iii) సబ్ రూలు 1 లేక 2 ననుసరించి, వ్యాపారికి చెప్పుకునేందుకు అవకాశం కలుగజేసిన తర్వాతనే అదనంగా పన్ను విధించే ఉత్తర్వులు జారి చేయాలి.

## లెక్కల పుస్తకములు

45. (1) యీ చట్ట ప్రకారం రిజిష్టరైన లేక లైసెన్సు పొందిన ప్రతి వ్యక్తి, యీ చట్ట ప్రకారం రిజిష్టరు కావలసిన ప్రతి వ్యాపారి, నియమింపబడ్డ విధానంలో పన్నువిధించే లేక లైసెన్సుయిచ్చే అధికారిచే నోటీసు జారీచేయబడ్డ ప్రతి వ్యాపారి రాజ్యాంగి చట్టములో ఉదహరింపబడ్డ 8 వ షెడ్యూలులో పేర్కొన్న, ఏ భాషలోనైన లేక యింగ్లీషులోనైనా యదార్థమైన, సరియైన, లెక్కల పుస్తకాలను నియమిత విధానంలో నిర్వహిస్తూవుండాలి.

ఈ క్రింద సూచించిన వివరాలు లెక్కలలో ఉదహరించాలి.

(1) తాను ఉత్పత్తిచేసిన, తయారుచేసిన, కొన్న, అమ్మిన, సరుకుల విలువ.

(2) సరుకులు ఎవరివద్దనైనా కొన్నప్పుడు, ఆయా వ్యక్తుల పేరు, చిరునామా, అమ్మకందారు దస్కత్తు, తేదీలతోగూడిన బిల్లు లేక డెలివరీ నోటు వివరంగా వుండాలి.

(2) (ఎ) సింగిలు పాయింటులో పన్ను విధింపబడే సరుకులలో వ్యాపారముచేసే ప్రతి వ్యక్తి, సంవత్సరములో 20 వేలకు మించి వ్యాపార మొత్తంవుండే ప్రతి యితర వ్యాపారి, 5 రూపాయలు లేక అంతకు మించిన ప్రతి అమ్మకానికి, బిల్లు లేక క్యాషుమెమో యివ్వాలి. అంతేగాక కొను గోలుదారు, బిల్లు లేక క్యాషుమెమో ఏ సందర్భములో అడిగినాయివ్వాలి.

(బి) ప్రతి బిల్లు లేక క్యాషుమెమో పైన తేదీ, వ్యాపారి లేక మానేజరు లేక ఏజెంటు దస్కత్తు వుండాలి. సదరు బిల్లు లేక క్యాషు మెమో, నకలును వ్యాపారి జాగ్రత్త పరచాలి.

(3) వ్యాపారి ప్రతి సంవత్సరంలోను యిచ్చిన సదరు బిల్లులు, లేక క్యాషుమెమోలకు వరుస నెంబరు వేయాలి. ప్రతి బిల్లు లేక క్యాషు మెమో కాండంలో ప్రతి వ్యాపారి, అతని వ్యాపారపు పూర్తిపేరు, వ్యాపారపు పద్ధతి, అమ్మిన సరుకుల వివరాలు, ధరలు, టోకు వ్యాపారసందర్భములో, కొనుగోలుదార్ల పూర్తిపేరు, చిరునామా ఉదహరించాలి.

(4) ప్రతి వ్యాపారి, చిల్లరవ్యాపారికి అమ్మకం లేక అమ్మకాల సందర్భములో విడుదలచేసే సరుకులకు బిల్లు యివ్వని పక్షంలో ఫారంXలో డెలివరీ నోటురొక్క రెండు నకళ్ళు తన మేనేజరు లేక ఏజంటురొక్క దస్కత్తుతో యివ్వాలి. యీ డెలివరీ నోట్లకు సంవత్సరవారీగా వరుస నెంబరు వేయవలయును.

(5) షెడ్యూళ్లు II, III, VI, లలో, ఉదహరించిన సరుకులలో వ్యాపారంచేసే ప్రతివ్యక్తి, రాష్ట్రంలో మొదటి అమ్మకందారు, లేక కొను గోలుదారు కానందువల్ల సరుకులపై పన్ను విధింపబడని పక్షంలో, తాను సరుకులు కొన్న వ్యక్తినుంచి, ఫారం XI లో డిక్లరేషను పొందాలి. ఈ డిక్లరేషనులో సదరు సరుకులపై "సింగిలుపాయింటు" లో పన్ను తాను గాని, లేక డిక్లరేషనులో ఉదహరించిన తదితరలుగాని, పన్ను చెల్లించి నట్లుగా ధృవపరచాలి.

(6) సెక్షను 11 ప్రకారం లైసెన్సు పొందిన ఏ వ్యక్తి అయినా రాష్ట్రంలో తెలిసిన ఉత్పత్తిదార్ల తరఫున అనుకొన్న కమీషనుకు, లేక బ్రోకరేజికి, గాక తదితరత్రా వ్యవహరిస్తే అలా వ్యవహరిస్తే ప్రతి వ్యవహారానికి ప్రత్యేక లెఖ్ఖలు వుంచాలి.

(7) ఈ చట్ట ప్రకారం లైసెన్సు పొందిన ప్రతి వ్యాపారి, ఈ చట్ట ప్రకారం వివిధరేట్లకు పన్ను విధింపబడే వివిధరకాల వస్తువులకు ప్రత్యేక లెఖ్ఖలు చూపాలి.

(8) లైసెన్సుదారులు, వ్యాపారులు, నిర్వహించే అన్ని లెఖ్ఖల పుస్తకములు, నిలవలు, ఉత్పత్తి, అమ్మకాలు, విడుదలలు, కొనుగోలులు, వీటికి సంబంధించిన అన్ని రశీదులతోసహా, సదరు తఖ్ఖీలు ఏ సంవత్సరానికి సంబంధించాయో, ఆ సంవత్సరం తరువాత 4 సంవత్సరాలవరకూ ఆయా వ్యక్తులు వుంచాలి.

## తనిఖీ ఆఫీసులు

46. (1) ఆంధ్రప్రదేశ్ గెజెట్టులో ప్రకటించి, రాష్ట్రప్రభుత్వం, రాష్ట్రంలో ఆయా ప్రదేశంలో, లేక ప్రదేశములయందు తనిఖీ ఆఫీసులు అడ్డంకులు నెలకొల్పడానికి చర్యతీసుకొనవచ్చును.

(2) ఆవిధంగా నెలకొల్పబడే ఆఫీసుల అడ్డంకుల వద్ద తనిఖీ ఆఫీసు అధికారి లేక అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు హోదాకుతగ్గని, యీ శాఖకుచెందిన ఏ యితర అధికారి అయినా అడిగినప్పుడు సరుకుపడవ లేక బండి డ్రైవరు లేక సరుకులు ఆధీనంతోగల తదితరవ్యక్తి ఆయా అధికారి, పడవ లేక బండిలోని సరుకులను తనిఖీచేసుకోటానికి, లేక రవాణాకు సంబంధించిన రికార్డులు పరీక్షించటానికి న్యాయంగా ఎంతకాలం పట్టుతుందో, అంతకాలం పడవ లేక బండినినిలబెట్టి తనిఖీచేసుకోనివ్వాలి.

(3) ఎ. డెలివరీనోటు సరుకుబండి రికార్డు, ట్రిప్పుషీటు, లేక లాగ్ బుక్కు, లేక ఉండవలసిన అమ్మకపు బిల్లులు, వాటిలో వుదహరించకుండా ఉన్న సరుకులను ఏ వ్యాపారి అయినా, రవాణా చేస్తున్నట్లు తనిఖీలో సదరు అధికారి కనిపెట్టితే, సబ్ రూల్ (4) లో నిర్ణయించిన విధానంలో సదరు అధికారి అట్టి సరుకులను అక్కడ దింపించి, ప్రభుత్వానికి సంక్రమింప జేయవచ్చు.

(బి) సరుకులను పైవిధంగా దింపించటానికి ఏ అధికారి అయినా, ఉత్తర్వు జారీచేసినప్పుడు, అలాదింపబడిన సరుకుల మొత్తం వివరాలు ఉదహరిస్తూ సదరు అధికారి రసీదు యివ్వాలి. సదరు రసీదు ముట్టినట్లు పడవ లేక బండిడ్రైవరు లేక తదితర వ్యక్తివద్దనుంచి ఒక రసీదును పొందాలి.

(4) సదరు అధికారి, సరుకులను ప్రభుత్వానికి సంక్రమింప జేసే ముందు, పడవలోగాని, బండిలోగాని, యజమాని హాజరుగావుంటే, యజమాని చెప్పకొనేందుకు పూర్తి అవకాశము యివ్వాలి. యజమాని హాజరుగా లేనిపక్షంలో అధికారి అవసరమైన దర్యాప్తుచేసి యజమానిపేరు, చిరు

నామా తెలుసుకుని, సరుకులను ప్రభుత్వానికి సంక్రమింపజేసేముందు, యజమాని చెప్పుకొనేందుకు పూర్తి అవకాశం యివ్వాలి.

(5) ప్రభుత్వానికి సంక్రమింప చేయబడిన సరుకులను బహిరంగంగా వేలం వేయాలి. ప్రభుత్వానికి సంక్రమింపజేసే ఉత్తర్వుయొక్క నకలు యజమానికి అందజేయాలి.

(6) సంక్రమింపజేసే వుత్తర్వుపైన అప్పీలు దాఖలు చేయబడితే ఆకారణంగా, నిలువవుండని సరుకుల పక్షంలో వీటివేలం వాయిదా వేయకూడదు.

(7) గివిజను లేక అప్పీలులో సంక్రమణ ఉత్తర్వు రద్దు చేయబడినప్పుడు, వేలం జరిపే అధికారికి యీ రద్దు ఉత్తర్వు అందక పూర్వం, సంక్రమణ సరుకులు వేలం వేయకుండా వున్నా, లేక వేలం వేయబడినా ఆ అధికారి 9 వ సబ్ రూలు ప్రకారం పరిష్కరించాలి.

(8) యజమాని ఎవరో తెలుసుకోటానికి వీలు లేనందువల్ల, సరుకులు ప్రభుత్వానికి సంక్రమింపజేసినప్పుడు, సదరు అధికారిముందు, యజమాని తరఫున ఏవ్యక్తి అయినా హాజరై సదరుసరుకులకు సంబంధించిన యదార్థాన్ని, సంతృప్తికరంగా ఋజువు చేయవచ్చును. పన్ను ఎగవేయాలనే దుర్బుద్ధి లేదని అధికారి అభిప్రాయపడ్డప్పుడు ఆ యా కారణాలను లిఖిత పూర్వకంగా ఉదహరిస్తూ సదరు సరుకులను, విడుదల చేస్తూ ఉత్తర్వులను జారీ చేయవచ్చు. సరుకులను స్వాధీనములోనుంచుకొన్నందుకు ప్రభుత్వానికి అయిన ఖర్చుల మొత్తాలను చెల్లించాలని సదరు అధికారి తన ఉత్తర్వులో నిర్ణయించవచ్చు. అధికారి సంతృప్తిపడనిచో లిఖితపూర్వకంగా ఉదహరిస్తూ సబ్ రూలు (5) ప్రకారం, వేలం జరపాలని ఉత్తర్వులు జారీచేయవచ్చు.

(9) సబ్ రూలు 7 ననుసరించి సరుకును వప్పగింత చేయాలని ఉత్తర్వులు జారీచేసిన సందర్భములో సరుకులు అమ్మకుండా ఉంటే, సరుకులను అమ్మిన పక్షంలో ప్రభుత్వానికి, వాటి కాపలాకు మొదలయినవాటిఖర్చులు చెల్లించిన తరువాత, అమ్మకపు మొత్తం లేదా సరుకులు యజమానికి లేక అతని ఏజెంటుకు సదరు అధికారి వప్పగింత చేయాలి.

47. (1) తనిఖీ ఆఫీసులవద్దగాక, మరేప్రదేశమందయినా అసిస్టెంటు కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరుహోదాకు తగ్గని యీ శాఖ అధికారి ఎవ్వరయినా, సరుకుపడవ, లేక బండిడ్రైవరు, లేక సరుకును చూచే తదితర వ్యక్తి ఆ యా అధికారి, లేక పడవ బండిలోని సరుకును తనిఖీ చేసుకోవడా

నికి, లేక రవాణాను సంబంధించిన రికార్డు పరీక్షించడానికి న్యాయంగా ఎంతకాలం పడుతుంతో అంతకాలం పడవలేక బండిని నిలబెట్టి, తనిఖీ చేసుకోనివ్వాలి.

(2) డెలివరీనోటు, సరుకుబండి రికార్డు, ట్రిప్పుషీటు, లేక లాగ్ బుక్కు లేక ఉండవలసిన అమ్మకపుబిల్లు వీటిలో ఉదహరించకుండా వున్న సరుకులు ఏవ్యాపారి అయినా రవాణాచేస్తున్నట్లు తనిఖీసందరములో అధికారికి కనిపిస్తే, 46 వ రూలులో 4వ సబ్‌రూలు ననుసరించి, సదరు అధికారి సరుకులను దింపించి, వాటిని ప్రభుత్వానికి సంక్రమింపజేసే చర్య తీసుకొనవచ్చును.

(3) 2 వ సబ్‌రూలు ననుసరించి సంక్రమింప జేయబడ్డ సరుకుల విడుదల విషయంలో 46వ రూలులో ఉదహరించినట్లు నడుచుకోవాలి.

48. (1) యీ చట్టములో 28 వ శెక్షను ప్రకారం అధికారాన్ని పొందిన ఏ ఉద్యోగి అయినా, ఒక వ్యాపారికి సంబంధించిన ఏ ఆఫీసులో, దుకాణంలో, గిడ్డంగిలో, బండిలో, పడవ లేక యితర వ్యాపారస్థలంలో, ఏ యితర కట్టడములో లేక స్థలంలో ఆ వ్యాపారి లెక్కలపుస్తకాలను, రిజిష్టర్లను, లేక తదితర పత్రాలలో ఉదహరించకుండా వున్న సరుకులు ఏ మైనా కనిపిస్తే, వాటిని సదరు అధికారి 46 వ రూలు ననుసరించి తీసుకోవలసిన చర్యతీసుకుని, సదరు సరుకులను స్వాధీనపర్చుకుని ప్రభుత్వానికి సంక్రమింప జేయవచ్చును.

(2) సబ్‌రూలు 1 ననుసరించి సంక్రమింపజేయబడ్డ సరుకుల విడుదల విషయంలో 46 వ రూలులో ఉదహరించినట్లు నడుచుకోవాలి.

49. (1) యీ చట్టములోని 28 వ శెక్షను ప్రకారం సక్రమంగా అధికారాన్ని పొందిన ఏ ఉద్యోగి అయినా, వ్యాపారియొక్క ఆఫీసును, షాపు, గిడ్డంగి, పడవ లేక బండి, లేక ఏ యితర వ్యాపారస్థలమైనా, లేక ఏభవనమైనా, లేక వ్యాపారానికి సంబంధించిన లెక్కలనైనా; రిజిష్టర్లు, లేక యితర పత్రాలు; అక్కడ వ్యాపారి ఉంచినాడని అభిప్రాయపడటానికి అధికారికి కారణాలు కనిపిస్తే, ఆ స్థలంలో ప్రవేశించి పరిశోధన జరపవచ్చు, అయితే, పరిశోధించేటప్పుడు సాధ్యమైనంతవరకు 1899 (సెంట్రలుయాక్టు) క్రిమినలు ప్రొసీజరు కోడ్‌లో నిర్ణయింపబడ్డ విధానం ప్రకారం చర్యతీసుకోవాలి.

(2) ఈ చట్ట ప్రకారం చెల్లింపవలసిన పన్నుగాని, లేక బకాయిగాని, ఏ వ్యాపారి అయినా తప్పించుకోవటానికి ప్రయత్నిస్తున్నాడని, సదరు

అధికారి తనిఖీలో అనుమానిస్తే, కారణాలను లిఖితపూర్వకంగా ఉదహరిస్తూ, వ్యాపారియొక్క ఆయా లెక్కలను, రిజిష్టర్లను, లేక అవసరమైన పత్రాలను స్వాధీనపర్చుకోవచ్చును. ఇలా స్వాధీపర్చు కొన్నందుకు వ్యాపారికి, ఆ అధికారి రశీదు యివ్వాలి. స్వాధీనపర్చుకున్న రికార్డు సదరు అధికారి, పై అధికారి అనుమతి పొందకుండా ఒక్కొక్క పర్యాయం, 30 రోజులకు మించి తనవద్ద ఉంచుకోవటాకి వీలులేదు.

## యితర విషయాలు

50. (1) పన్ను విధించే, లైసెన్సుయిచ్చే, అప్పిలేట్ లేక రివిజన్ చేసే ఏ అధికారి అయినా రికార్డులో ప్రత్యక్షంగా కనుపించే లెక్కలకు సంబంధించిన ఒక గుమాస్తా చేసిన ఏ తప్పునైనా, ఆయా అధికారి ఉత్తర్వు జారీ చేసిన తేదీలగాయితూ, 4 సంవత్సరములలోపల సవరించవచ్చును.

కాని పైన పేర్కొన్న తప్పు, పన్ను, లేక అపరాధమును, లేక ఫీజు హెచ్చింపును సంబంధించినది అయితే, ఆయా అధికారి వ్యాపారికి, ఈ సందర్భంలో చెప్పుకోనేందుకు పూర్తి అవకాశము యివ్వకుండా ఎట్టి సవరణ చేయకూడదు.

(2) పైన సూచించిన తప్పు, పన్ను లేక అపరాధము, లేక ఫీజు తగ్గించటానికి సంబంధించినది అయితే పన్ను విధించే అధికారి అదనంగా వసూలు చేసిన మొత్తాన్ని వ్యాపారికి వాపసు చేయాలి.

(3) పై సవరణ, పన్ను లేక అపరాధము లేక ఫీజు హెచ్చించడానికి సంబంధించినది అయితే, పన్నువిధించే అధికారి ఫారం "బి-3" లేక "బి-6" లో వ్యాపారికి మార్పును తెలుపుతూ నోటీసు అందజేయాలి. అలా నోటీసు జారీచేసిన పిమ్మట, సదరు నోటీసు ముట్టినందోటే జారీ చేయబడినట్లుగా ఎంచుకోబడి, చట్టనిబంధనలన్నీ అమలులో ఉండును.

51. ఒక వ్యాపారి లేక లైసెన్సుదారు, తన వ్యాపారంలో మరొకరితో కలసి భాగస్వామ్యంగా ఏర్పడితే, ఏర్పాటు జరిగిన తేదీలగాయితూ 30 రోజుల లోపల ఈ విషయాన్ని వ్యాపారి లైసెన్సుయిచే లేక రిజిష్టరు చేసే, లేక పన్నువిధింపు అధికారికి తెలియపరచాలి. ఈచట్టప్రకారం విధింపబడే పన్ను లేక అపరాధము లేక ఫీజు చెల్లించటానికి వ్యాపారి లేక లైసెన్సుదారు, భాగస్వామి సమిష్టిగాను, వ్యక్తిగతంగాను బాధ్యత వహిస్తారు.

52. భాగస్వామ్యం రద్దుఅయితే, భాగస్వామిగా వున్న ప్రతి వ్యక్తి రద్దుఅయిన 30 రోజుల లోపల లైసెన్సుయిచ్చే రిజిష్టరుచేసే, పన్ను విధించే అధికారికి తెలియపర్చాలి.

53. (ఎ) ఏ కాలమందయినా, ఏ వ్యాపారి లేక లైసెన్సుదారు - తను చేసే వ్యాపారం పూర్తిగాగాని, లేక కొంత భాగంగాని, ఆపినా లేక అమ్మినా, లేక మరోవిధంగా మార్చినా లేక.

(బి) వ్యాపార స్థలాన్ని లేక స్థలాలను మార్చినా, లేక

(సి) కొత్త వ్యాపారస్థలాన్ని ఏర్పాటు చేసినా; లేక

(డి) తను వ్యాపారపు పేరును మార్చినా, వ్యాపారి లేక లైసెన్సుదారు, లేక అతను మరణిస్తే, అతని వారసులు 30 రోజులలోపల ఈ విషయాన్ని ఆయా ప్రాంతపు పన్నువిధించే లేక లైసెన్సు యిచ్చే అధికారికి తెలియపర్చాలి.

54. శిక్షను 12 ప్రకారం రిజిష్టరు కావలసిన ప్రతివ్యాపారి, హిందూ అవిభక్త కుటుంబం, సంఘం, క్లబ్, ఫరం, సొసైటీ, కంపెనీ ఒకరి తరఫున గార్డియన్‌గాని, ట్రస్టీగాని, లేక యితరత్రా గాని వ్యాపారంజరిపే వ్యక్తితో సహా, యీ నిబంధనావళి అమలులోనికి వచ్చిన 30 రోజుల లోపల ఫారం XIIలో, రిజిష్టరుచేసే, లైసెన్సుయిచ్చే లేక పన్నువిధించే అధికారికి డిక్లరేషను అందచేయాలి. ఈ డిక్లరేషనులో యీ చట్టప్రకారం పంపవలసిన స్టేటుమెంట్లు, రిటరన్‌లపైన వాని తరఫున దస్కత్తు చేయటానికి నియమింపబడ్డ వ్యక్తి, లేక వ్యక్తులపేర్లను ఉదహరించాలి. సదరు వ్యక్తి లేక వ్యక్తుల దస్కత్తుతో పంపిన రిటరనులు, స్టేటుమెంట్లుకు, వ్యాపారి మొదలగువారికి పూర్తి బాధ్యత వుంటుంది. అవసరమనుకున్నప్పుడల్లా యీ డిక్లరేషనులో మార్పు చేసుకోవచ్చు.

55. పన్నువిధించే, లైసెన్సుయిచ్చే, అప్పిలేట్ లేక రివిజన్ చేసే అధికారికి 1908 క్రిమినలు ప్రొసీజరుకోడ్ ననుసరించి, కోర్టుకు ఏ అధికారాలు ఉండునో అట్టి అధికారాలన్నీ ఒక కేసు విచారించే సందర్భంలో యీ క్రింద వివరించిన విషయాలలో వుంటాయి.

(1) ఒక వ్యక్తికి, సమను జారీచేసి హాజరు పెట్టేందుకు;

(2) ఏ వ్యక్తినయినా ప్రమాణం చేయించి పరీక్షించేందుకు;

(3) ఏ పత్రాలనయినా దాఖలు చేయమని నిర్బంధించేందుకు అధికారములు వుంటాయి. సదరుపన్ను విధించే, లైసెన్సు యిచ్చే లేక రివిజను చేసే

అధికారి తీసుకున్న ప్రతిచర్యా, యిండియన్ పీనల్ కోడ్, 196, 228, 193 శిక్షల మేరకు తీసుకున్న న్యాయశాస్త్ర సమ్మతమైనచర్యగా పరిగణింపబడుతుంది.

56. పన్ను విధించే, లైసెన్సుయిచ్చే అప్పిలేట్, లేక రివిజను చేసే అధికారి ఫారం IXలో ఒక పత్రం దాఖలు చేయాలని, లేక ఒకవ్యక్తి హాజరు అవ్వాలని, సమను జారీచేయవచ్చును.

57. లైసెన్సుయిచ్చే, పన్నువిధించే, అప్పిలేట్ లేక రివిజనుచేసే అధికారిముందు, యీచట్టప్రకారం లేక యీ నిబంధనావళి ననుసరించి విచారణ సందర్భంలో సాక్ష్యం యివ్వటానికి హాజరైన వ్యక్తికి ప్రభుత్వమువారు అప్పుడప్పుడు నిర్ణయించే రేటు ప్రకారం ప్రయాణపు ఖర్చులు బేటాలు యివ్వబడతవి.

58. ఈ చట్టము లేక యీ నిబంధనావళిక్రింద ఒక వ్యాపారికి లేక లైసెన్సుదారుకు నోటీసు, సమన్సు, ఉత్తరువు, లేక నిర్ణయాలు, అందజేసే సందర్భంలో యీ క్రింద సూచించిన ఏపద్ధతిలోనైనా అందజేయవచ్చు.

(ఎ) సదరు వ్యాపారికి లేక లైసెన్సుదారుకు లేక అతని మేనేజరుకు అతని ఏజంటుకు దానిని అందజేయటంద్వారా; లేక

(బి) సదరు వ్యాపారి లేక లైసెన్సుదారు లేక అతని మేనేజరు లేక ఏజంటు కనిపించనిపక్షంలో, అతని ఆఖరి వ్యాపారస్థలంలో లేక గృహంలో దాన్ని ఉంచడంద్వారా లేక అతని కుటుంబంలో వయస్సు వచ్చినవారికి యివ్వటంద్వారా;

(సి) సదరు వ్యాపారి లేక లైసెన్సుదారు చిరునామా పన్ను విధించే లేక లైసెన్సు యిచ్చే అధికారికి తెలిసివున్నట్లయితే దానిని రిజిష్టర్డు పోష్టు ద్వారా పంపటం; లేక

(డి) పై వుదహరించిన పద్ధతులలో అన్ని లేక ఏ ఒక్కటైనా ఆచరణయోగ్యంగా లేనిచో అతను కడపటిసారి చేసిన వ్యాపారస్థలంలో లేక గృహములో కనిపించే స్థలంలో దాన్ని అంటించటంద్వారా;

59. (32) శిక్షనులో పేర్కొన్న అధికారములు, అసిస్టెంట్ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు హోదాకు తగ్గని యీ శాఖలోని ఉద్యోగులందరూ చెల్లాయించవచ్చు.

60. (1) రాష్ట్రంలోని ప్రతి బ్యాంకు, వాటి బ్రాంచి ఆఫీసులలో సహా, లేక క్లియరింగుహౌస్, 1957 జూన్ 15 వ తేదీనుంచి రాష్ట్రం వెలుపలనుంచి క్రిందటి నెలలో వసూళ్ళకుగాను వచ్చిన, పత్రాలతో కూడిన, లేక పత్రాలు లేని బిల్లులకు సంబంధించిన రిటరనులు, ప్రతి క్రిందటి నెలకు తయారుచేసినవి కమ్మర్షియలు టాక్సు ఆఫీసరుకు అందచేయాలి.

(2) సదరు రిటరను, ఏ నెలకు సంబంధించినదో తరువాత నెల 15వ తేదీని, లేక అంతకుముందు, ఆయా ప్రాంతపు కమర్షియల్ టాక్సు ఆఫీసరుకు దాఖలు చేసుకోవాలి.

(3) నిలవలు, వాటాలకు సంబంధించిన అమ్మకపు బిల్లులు ఈ రిటరన్‌లో చూపనక్కరలేదు.

61. (1) స్టేటుమెంటు, రిటరను, లెక్కల పుస్తకము, లేక పత్రాలలో ఉదహరించిన వివరాలను విచారణ సందర్భములో యిచ్చిన సాక్ష్యం, లేక దాఖలు చేసిన అప్పిలెట్ లేక వాజ్మూలములోని వివరాలు, లేక ఈ చట్టం క్రింద బాకీవసూళ్ళకు సంబంధించిన వ్యవహారపు రికార్డులోని వివరాలను రహస్యంగా వుంచాలి; ఈ వివరాల నెవరికీ తెలుపరాదు.

(2) 1 వ సబ్‌రూలులో వివరించినతేదీ ఈ క్రింద ఉదహరించి వివరాలను బహిరంగి పరచటానికి వర్తించవు.

2. (i) సదరు స్టేటుమెంటు, రిటరను, లెక్కల పుస్తకాలు, పత్రాలు, సాక్ష్యం, అఫిడవిట్టు, లేక వాజ్మూలము విషయంలో యిండియన్ పీనలుకోడ్ క్రింద దావా దాఖలుచేసే సందర్భములో లేక ఈ చట్టం, లేక ఈ నిబంధనావళి ననుసరించి, దావా దాఖలుచేసే సందర్భంలో;

(ii) ఈ చట్టం అమలు జరపటంలో ఒక వ్యక్తికి, సదరు సమాచారం బహిరంగ పర్చటం చట్టరీత్యా అవసరమైనప్పుడు;

(iii) ఈ చట్టప్రకారం బకాయి వసూలు సందర్భంలో, ఉద్యోగ ధర్మంలో చెప్పవలసి వచ్చినప్పుడు; లేక

(iv) ఈ చట్ట నియమావళి గురించి జరిపిన చర్యపైన దాఖలు చేయబడ్డ సివిలుదావాలో ప్రభుత్వము ఒక పక్షంగా వున్నప్పుడు సివిలుకోర్టు వారికి తెలుపవలసి వచ్చినప్పుడు; లేక

(v) తక్కువ స్టాంపులు అంటించినప్పుడు 1891 యిండియన్ స్టాంపు యాక్టు ప్రకారం ఒక ప్రభుత్వోద్యోగి కోరినప్పుడు; లేక

ఎ. భారత ప్రభుత్వం,

బి. పరస్పరం బహిరంగ పర్చుకోటానికి రాష్ట్రప్రభుత్వం, భారత దేశములో యితర రాష్ట్ర ప్రభుత్వంతోనైనా ఒడంబడిక చేసుకువచ్చే ఆ రాష్ట్ర ప్రభుత్వం.

సి. రాష్ట్ర ప్రభుత్వం పరస్పరం ఒడంబడిక చేసుకుని ఆ రాష్ట్రం, భారత రిపబ్లిక్‌లో లీనమైనప్పుడు ఆ రాష్ట్ర ప్రభుత్వం; లేక

(vi) ఈ క్రింది సుదహరించిన అఫీసరు.

(vii) రాష్ట్ర ప్రభుత్వం, వ్యాపార పన్నులశాఖగాక తదితర శాఖకు చెందిన ఏ ఉద్యోగి అయినా, ఈ క్రింద సూచించిన అధికారి ఆమోదము పొందిన పిమ్మట;

ఎ. అసిస్టెంటు కమర్షియల్ టాక్సు ఆఫీసరు లేక డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసరు, పదరు వివరాలను అందజేయవలసి వస్తే ఆ ప్రాంతపు కమర్షియల్ టాక్సు ఆఫీసరు అనుమతిన.

బి. డిప్యూటీ కమీషనరు లేక కమర్షియల్ టాక్సు ఆఫీసరు, సదరు వివరాలను అందజేయవలసిన వుంటే, రెవిన్యూబోర్డువారి; అనుమతి;

అయితే క్లాజు VII ననుసరించి అసాధారణ సందర్భాలలోనే, పదరు వివరాలు అందజేయబడతాయి. ఈ వివరాలు అందుకున్న వుద్యోగి, వాటిని రహస్యంగా వుంచాలి. ఈ వివరాలను ఉద్యోగధర్మంలోనే వినియోగించాలి.

62. ఈ నిబంధనావళి ననుసరించి చెక్కుద్వారా చెల్లించటానికి వీలు వున్నప్పుడు ఆ చెక్కులను క్రాస్ చేసి, వానికి సంబంధించిన ఉద్యోగికి చెల్లించాలి అని వ్రాయాలి. ఏ షెడ్యూలు బ్యాంకు పేర నైనా ఆ చెక్కు యివ్వబడి ఉండాలి.

63. (1) 35 వ సెక్షను ననుసరించి ఏ అధికారి ముందుఅయినా హాజరుఅయ్యే ఒక ఎకౌంటెంటు ఈ క్రింద ఉదహరించిన వ్యక్తి అయి వుండాలి.

(ఎ) సెంట్రలు రెవిన్యూబోర్డుచే గుర్తింపబడి, సెంట్రల్ బోర్డు ఆఫ్ రెవిన్యూఆక్టు 1924 ప్రకారం అకౌంటెన్సీ పరీక్షపాస్యయియుండి 1922 యిండియన్ యిన్‌కమ్‌టాక్సు చట్టం 61 సెక్షనుకుగాను ఏర్పాటుచేయబడిన అర్హతకలిగి ఉండవలయును.

(బి) 35 సెక్షనుక్లాజు (సి) ప్రకారం ఏ అధికారి ముందు అయినా హాజరు అయ్యే అమ్మకపుపన్ను ప్రాక్టీషనరు గుర్తింపబడ్డ విశ్వవిద్యాలయపు కామర్సు లేక ఎకనామిక్సు గ్రాడ్యుయేటు అయివుండాలి. లేక 1957 జూన్ 15 వ తేదీకి పూర్వం, సేల్సుటాక్సు అధికారివద్ద ఒక వ్యాపారి తరఫున హాజరయిన, ఏ యితర వ్యక్తి అయినా అయివుండాలి. (అయితే ఈ వ్యక్తి వ్యాపారియొక్క ఉద్యోగిగాగాని, లేక బంధువుగాగాని హాజరు అయినవాడుగా వుండకూడదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు రెవిన్యూబోర్డు ఆఫీసు జాపితాలో సేల్సుటాక్సు ప్రాక్టీషనరుగా చేర్చబడిన వ్యక్తి అయి వుండాలి.

(2) ఏ అమ్మకపు పన్ను వ్యవహారంలోనైనా, సేల్సుటాక్సు ప్రాక్టీషనరు దుర్మార్గంగా ప్రవర్తించాడని బుజువయితే, 35వ సెక్షను ప్రకారం ఏవ్యాపారి తరఫున హాజరు అయ్యేందుకు యోగ్యుడుకాడని రెవిన్యూబోర్డు ఉత్తర్వును జారీ చేయవచ్చును. అయితే సేల్సుటాక్సు ప్రాక్టీషనరు చెప్పు కొనేది వినకుండా సదరు ఉత్తర్వు జారీ చేయకూడదు.

(3) సబ్‌రూలు 3 ననుసరించి జారిచేసిన, వుత్తరువు అందిన నెల రోజుల లోపల యీ వుత్తరువు రద్దుచేయమని సదరు సేల్సుటాక్సు ప్రాక్టీషనరు ప్రభుత్వానికి అప్పీలు చేసుకొనవచ్చు; అయితే జారీ చేయబడ్డ సదరు వుత్తర్వు అందిన తేదీనుంచి నెలరోజులు దాటేవరకూ అమలులోనికి రాదు. అప్పీలు చేసే పక్షంలో అప్పీలు విచారించి, తీర్పుచెప్పేవరకూ ఆ వుత్తరువు అమలులోనికి రాదు.

64. 30 (13), 45, 51, 52, 53, 54, 61 నిబంధనలలో దేనినైనా అతిక్రమించిన వ్యక్తి ఫస్టుక్లాసు మేజిస్ట్రేటుచే విచారింపబడి, రెండు వేల రూపాయల వరకూ జుల్మానా విధింపబడవచ్చు.

65. ఆయా నిబంధనల ననుసరించి ఆయా ఫారములు పూర్తిచేసి; ఆయారిటరనులు పంపాలి; ఆయా లెక్కల పుస్తకాలను నిర్వహిస్తూ వుండాలి.

—: సమాప్తము :—

# 1. రేట్లు

(1) "రిజిష్టర్డు డీలరుకు"

రు 7500 మించనియెడల = పన్ను లేదు

రు 10,000 మించినయెడల = రు 1కి 2 నయాపైసాలు

రు 25,000 లోపలి కాఫీహోటలు హోటలు, అమ్మకమునకు } = రు 1కి 3 నయాపైసాలు

షెడ్యూలు I కి లోనివస్తువులు = రు 1 కి 2+3 న. పై.

షెడ్యూలు IIలో వస్తువులకు = మొదటి అమ్మకమునకు మాత్రమే

షెడ్యూలు III లో వస్తువులకు = మొదటి కొనుగోలుకు మాత్రమే

షెడ్యూలు IV లోని "డిక్లేర్డువస్తువులకు } = మొదటి కొనుగోలు లేక అమ్మకమునకు మాత్రమే

షెడ్యూలు V లోని వస్తువులకు } = పన్ను లేదు

(2) "క్యాజువల్ డీలర్‌కు" (అవకాశ వ్యాపారికి) టర్నోవరుతో నిమిత్తం లేకుండా జరిగిన వ్యాపారమునకు పన్ను వేయబడును.

(3) "లైసెన్సుదారుకు" లైసెన్సుపొంది తెలియబరచబడిన యజమానిగల, ఏజంటుకు అతని టర్నోవరుపై పన్ను లేదు.

# 2. మినహాయింపులు

## 8 వ సెక్షను ప్రకారము

ఈ దిగువనుదహరించిన వస్తువులకు పన్నులేదు షెడ్యూలుV

1. పుప్పొ
2. విద్యుచ్ఛక్తి
3. మోటారు స్పిరిట్సు
4. కల్లు

## శెక్షను 9 ప్రకారము

5. మొక్కజొన్న కండెలు. 6. పచ్చిగడ్డి, పండుగడ్డి. 7. పాలు, పెరుగు, మజ్జిగ. 8. పువ్వులు 9. గ్రుడ్లు 10. పచ్చి మాంసము 11. అన్నిరకముల పండ్లు, కొబ్బెరకాయలు మినహా 12. కూరగాయలు, బంగాళాదుంపలు, ఉల్లిపాయలు, మినహా 13. పచ్చి లేక ఎండుచాపలు 14. రాట్నములు , వానిభాగములు 15. గనివద్దబొగ్గు 16. మట్టిపని 17. ఎక్సురే ఫోటోలు 18. రోగనిదానమునకు తీసిన ఎక్సురే ఫోటోలు. 19. సొంతదారులైన వైద్యులు యిచ్చిన మందులు ప్రిస్క్రిప్షన్సు 20. గవర్నమెంటువారు ప్రచురించిన పుస్తకములు, స్టేషనరీ, వారి డిపార్టుమెంట్లుకు పంపినప్పుడు 21. విశ్వవిద్యాలయముల ప్రచురణలు 22. ఫారన్ బైబిలు సొసయిటివారి సద్గ్రంథములు, ఖురాను, మతగ్రంథములు, వేదములు, వాటిభాష్యములు, దివ్యజ్ఞానము వారి పుస్తకములు, వారి విక్రయశాలలోగాని, అవే పుస్తకములు మాత్రము అమ్ముశాలలో మాత్రము. 23. చేనేత మగ్గములపై తయారైనగుడ్డ, నూలు. 24. ఆస్పత్రులలోని రోగులకుయిచ్చు ఆహారము 25. దంపుడుబియ్యము 26. బ్యాం

కులు వారు బ్రాంచీలు అమ్మకందారు లయినప్పుడు 27. మిల్లు నూలుతో చేనేతమగ్గములపైన బట్టలు, ఆగుడ్డలలోనే వ్యాపారము చేయునప్పుడు 28. తవుడు, చిట్టు, వూక (ధాన్యముపై కొనుగోలు పన్ను కట్టినయెడల) 29. ధర్మ సంస్థలు విధ్యార్థుల భోజనమునకు వసూలుచేయు రుసుము 30. చేగానుగలచే తయారుచేయబడిన నూనె 31. చేగానుగ సహకార సంఘములయొక్క నూనెలు.

32. బంగాళాదుంపలు

| | | | |
|---|---|---|---|
| రు 15,000 | లోపుటర్నోవర్కు | | రు 96–0–0 |
| రు 15,000 | పైన | 20,000 లోపల | రు 144–0–0 |

33. ఉల్లిపాయలు

| | | | |
|---|---|---|---|
| రు 12,500 | లోపల | | రు 48–0–0 |
| రు 12,500 | పైన | 20,000 లోపల | రు 72–0–0 |

## 3. లైసెన్సులు వగయిరా

1. వ్యాపారస్తుని రిజిస్ట్రేషన్ — రు 6/– సం॥నకు
2. రెన్యూయల్ రుసుము సం॥నకు — రు 6/–
3. సర్టిఫికెటు నకలు — రు 0–8–0
4. లైసెన్సు ఫీజులు

| | | | |
|---|---|---|---|
| రు 25,000 | — | లోపు | రు 50/– |
| రు 25,000 | — | రు 50,000/–వరకు | రు 100/– |
| రు 50,000 | — | రు 1,00,000/–వరకు | రు 200/– |

లక్షకు మించిపైన ప్రతి 1 లక్షకు రు 100/– చొప్పున చెల్లించవలయును. రు 1000/– పైన ఫీజు చెల్లించ

నవసరము లేదు. రెన్యూయల్ కుగూడ యిదే ప్రకారము చెల్లించవలయును.

5. లైసెన్సు నకలుకు —— రు 1–0–0

## 4. టర్నోవరుపీుద ఎవరు పన్ను వేయునది

1. మొదటి రు 7500/—లకు పన్ను లేదు
2. మొదటి రు 50,000/— వరకు ......... A.C.T.O.
3. మొదటి రు 50,000 నుండి 5 లక్షల వరకు D.C.T.O.
4. ,, 5 లక్షలపైన ఎంతవరకైనా C.T.O.
5. అవకాశ వ్యాపారికి D.C.T.O.

## 5. అప్పీళ్లు రివిజనులు వగైరా
### ఎవరికిచేసు కొనవలసినవి

1. A.C.T.O. పైన కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరుకు
2. D.C.T.O. పైన డిప్యూటి కమీాషనరుకు
3. C.T.O. పైన డిప్యూటి కమీాషనరుకు
4. డిప్యూటి కమీాషనరుకు పైన రెవిన్యూబోర్డు అప్పిలెట్స ట్రిబ్యూనల్ -

7. అప్పిలెట్ ట్రబ్యూనలు పైన (లాపాయింటుమీాద లేక రివిజనుకు రెవిన్యూబోర్డు } హైకోర్టుకు
8. హైకోర్టు పైన సుప్రీము కోర్టుకు

రెవిన్యూబోర్డు వారుగాని హైకోర్టు వారుగాని వారి క్రింది అధికారులు చెప్పిన నిర్ణయములను నాల్గు సంవత్సరముల లోపల తమంతటతామై విచారించి తమకు న్యాయమనితోచిన ఉత్తరువులను చేయవచ్చును.

## 5 (A) అప్పీళ్లు, రివిజన్‌లు వగైరా



# 5. (B) అపీళ్లు రివిజన్లు వగైరాలకు రుసుములు, రోజులు

| | కోర్టు ఫీజు స్టాంపులు | రోజులలో |
|---|---|---|
| 1. A.C.T.O. వారి వుత్తర్వుల పై C.T.O. వారికిఅప్పీలు చేసినప్పుడు | రు 3/- | 30 |
| 2. D.C.T.O. వారి వుత్తర్వుల పై Deputy Commissioner గారి వద్ద దాఖలుచేసినప్పుడు | రు 3/- | 30 |
| 3. C.T.O. వారికి వుత్తర్వుల పై Deputy Commissoiner గారి వద్ద దాఖలుచేసినప్పుడు | రు 3/- | 30 |
| 4. Deputy Commissioner గారి ఉత్తర్వుల పై అప్పిలెట్ ట్రిబ్యూనలుకు దాఖలుచేసి నప్పుడు | రు 25/- లేక నూటికి 1/-చొ॥ రు100/-మించకుండా ట్రెజరీలో కట్టవలయును | (60) |
| 5. Appellate Tribunal వుత్తర్వుల పై హైకోర్టు వారికి | రు 100/- | 90 |
| 6. Revenue Board వారి ఉత్తర్వు పై Hight Courtకు | రు 100/- | 60 |
| 7. శెక్షను 22 (7) 23 (4) పై హైకోర్టు రివిజనుకు | రు 100/- | నెలలు12 |

# 6. నేరములు, శిక్షలు

| | | జరిమానా |
|---|---|---|
| 1. | పన్ను, అపరాధము, రుసుము చెల్లించనియెడల | రు 2000/- మించనిది |
| | లేక | |
| 2. | రిజిష్టరు చేయించుకోని యెడల | రు 2000/- మించనిది |
| 3. | శెక్షను 28 ప్రకారము ఒకయింటిలో ప్రవేశము గాని, సోదాగాని ఆటంక పరచినచో | శిక్ష 6 మాసములు లేక జరిమానా రు 2000/- లేక రెండున్నూ |
| 4. | వస్తువులు, వాహనములు, పడవలు, చూచుటకు ఆటంకపరచినచో | శిక్ష, 6 మాసములు జరిమానా రు 2000/- లేక రెండున్నూ |
| 5. | సరిగాని, రిటరును పంపిన, | మొదటి నేరమునకు జరిమానా, 2000/- లు |
| 6. | మోసము చేయవలయునని ఉద్దేశ్యము, పన్ను ఎగవేసినా, రుసుములు చెల్లించకపోయినా | రెండవ నేరమునకు శిక్ష 6 మాసములు జరిమానా రు 2000/- లేక రెండున్నూ |

| | |
|---|---|
| 7. ఈ చట్టముక్రింద నేరముచేసిన ఆసామీవద్దనుండి, నేరముచేసి నాడని సకారణముగా అనుమానింపబడిన వ్యక్తినుండి, వారివద్దనుండి రావలసిన పన్నుగాక | అదనముగా రు 1000/– గాని కట్టవలసిన పన్నుకు రెండింతలుగాని ఏది ఎక్కువ అయితే ఆసొమ్ము వసూలు పర్చవచ్చును. |

## 7. ఎప్పుడు, ఏమిచేయవలసినది

1. టర్నోవరు

| | |
|---|---|
| రు 7500/– దాటిన 30 రోజులలోగా | రిజిష్టరు చేయించుకోవలయును |
| లేక II, III, IV షెడ్యూలు దాఖలా వస్తువులలో వ్యాపారంచేసినా | Do |

| | |
|---|---|
| 2. మీరు కమీషను ఏజంట్లు అయిన ఎడలగాని, పేరు తెలియని వ్యాపారస్థుని తరపున పనిచేయునప్పుడుగాని | లైసెన్సు పొందవలయును. |
| 3. మీరు అవకాశ వ్యాపారి అయినయెడల చిరునామా, వ్యాపారము చేయు వస్తువులపేర్లు, ఎప్పుడు వెళ్లేది. | వ్యాపార ప్రదేశము నకు వచ్చిన 24 గంటలలో వెంటనే ఆఫీసరుకు తెలియపరచవలయును. |

| | |
|---|---|
| 4. 15-6-1957 మొదలు 30 రోజులలో రు 10,000 టర్నోవరు మించిన ప్రతి వ్యాపారస్తుడు | Form A. 1 పంపవలయును |
| 5. లేక రు 10,000/- టర్నోవరు అయిన తేదీనుండి నెలరోజులలోగా | Form A పంపవలయును |
| 6. ప్రతి వ్యాపారస్థుడు Form B అందిన వెంటనే | ప్రతి నెలకు పన్ను కట్టవలయును. |
| 7. అవకాశ వ్యాపారస్థుడు తాను వెళ్లేలోగా | Form A 3 పంపి పన్ను చెల్లించవలయును |
| 8. ఆర్థిక సంవత్సరాంతమైన 30 రోజులలోగా ప్రతి వ్యాపారస్థుడు | Form A 1 పంపవలయును |
| 9. Form B·3 అందిన వెంటనే | పన్ను చెల్లించవలెను |
| 10. పన్నునోటీసు అందిన 30 రోజుల లోపల ప్రతి వ్యాపారస్థుడు తనకు వేసిన పన్నుపై | అప్పీలు చేసుకొనవచ్చును. |

ఈ ఆక్టుకు సంబంధించిన రిటరన్ ఫారములు తెనాలి మారీసుపేట, ఆంధ్రరత్న పవర్ ప్రెస్‌లో దొరకును.

## ఇంగ్లీషు - తెలుగు - హిందీ స్వబోధిని

రచన: ఆలపాటి సుబ్బారావు చౌదరి

మానవుడు ఏకాకిగా వుండలేడు. ఒకరినొకరు అర్థము చేసికొన్నప్పుడే వారి జీవితములు హాయిగ గడపగలుగుదురు. అందులకు భాషాభ్యాసనము ముఖ్యము. బ్రిటిషు వారి పాలనలో మనకు ఇంగ్లీషుభాష పరిచయమైనది. అది ఈ రోజువరకు వ్యవహారభాషగా పరిగణింపబడుచున్నది. తెలుగు మనమాతృభాషయే! ఇక హిందీనికూడ ప్రధాన భాషగ పరిగణింపబడవలెనని, మన పెద్దలు పెక్కురు వక్కాణించు చున్నారు. ఈ పై విషయములు దృష్టిలో నుంచుకొని ఈ పుస్తకమును వెలువరించితిమి. ఈ త్రిభాషలను ఉపాధ్యాయునితో నిమిత్తము లేకనే దీని సహాయమున నేర్చుకొన వచ్చును. వెల రు. 2-8-0

---

## -: నూతన దస్తావేజుల మతలబు :-

శ్రీ కోటంరాజు కృష్ణారావుపంతులు, B. A. B. L

(హైకోర్టు అడ్వకేటు) గారిచే సవరింపబడినది.

ప్రతియింటను ముఖ్యముగ వుండవలసిన పుస్తకములలోనిది యొకటి. కొద్దిపాటి భాషాజ్ఞానము గలవారు సైతము తమతమ వ్యవహారములను ప్రైవేటుదారుల (కోర్టుపత్రముల) తోడ్పాటు లేకనే స్వయముగ చేసికొనవచ్చును. వివిధరకముల అర్జీలు, ప్రోనోట్లు దస్తావేజులు వ్రాయవలసిన పద్ధతులు, రిజిస్ట్రేషన్ ఫీజు, స్టాంపుడ్యూటీలు ఇంక అనేక విషయములు విపులముగ నిందు వ్రాయబడినవి.

కాపీలకై త్వరపడిండి! వెల 1-4-0

---

కావలసినవారు: ఆంధ్రరత్న బుక్ డిపో, తెనాలి

## మా పట్టి

1. తెలుగులో ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్సు టాక్సు ఆక్టు పుస్తకములు, రూల్సు ప్రకారం పంపవలసిన రిటరన్ ఫారములు 2. ఫ్యాక్టరీస్ ఆక్టు రూల్సు, రిటరన్ ఫారములు, రిజిష్టర్లు 3. షాప్ ఎంప్లాయిమెంటు ఆక్టు, రూల్సు, రిటరన్ ఫారములు, రిజిష్టర్లు 4. పాఠశాలలకు పనికి వచ్చు అన్ని రకముల రిటరన్ ఫారములు రిజిష్టర్లు, కోర్టుఫారములు, జనరల్ బుక్సు హోల్ శేల్‌గాను రిటైల్ గా ను విక్రయించ బడును. అన్నిరకములు ప్రింటింగు పన్లు చేయబడును.


ఆంధ్రరత్న బుక్ డిపో

ఫోన్ నెం. 64

ప్రో॥ గ్రంధి లక్ష్మయగుప్త,

మారీసుపేట, (P.O.) తెనాలి.

(ఆంధ్రప్రదేశ్)